[రవికాంత్ టెబుల్ దగ్గర సమీపించి తెలిఫోను రిసీవర్ యెత్తి నెంబర్ డయల్ చేశాడు)

రవి . హలో, పోలీస్ స్టేషన్, రవికాంత్ హియర్, ఆఁ, మా అన్నయ్య అక్కడున్నాడా? ఆఁ, ఆఁ, ఓకె, థాంక్స్. [ఫోన్ పెట్టే శాడు]

అవి . (ఆత్రంగా] ఏమైంది బావా?

రవి . ఇన్స్పెక్టర్ రాజారాంగారూ, అన్నయ్యా కలిసి ఇక్కడికే బయలు దేరారట,

మా . అయితే మరికాసేపట్లో రావచ్చు.

(బయటనుంచి నాగన్న, భీమన్న వచ్చారు)

నాగ . వస్తున్నారు.

భీమ . వచ్చేస్తున్నారు.

మ . యెవరు?

నాగ : వారే.

భీమ : అక్షశాలా వారే.

అ : యెవరు వారు?

చం : ఇంకెవరు? చక్రవర్తిగారే అయ్యుంటారు ఏమంటారు?

నాగ : ఏమీ అనం.

భీమ : ఏమీ అనలేము.

[బయటనుంచి చక్రవర్తి, రాజారాం వచ్చారు)

చం : గుడ్ మార్నింగ్ సార్.

శ : గుడ్ మార్నింగ్

అ : గుడ్ మార్నింగ్ సార్.

ః : గుడెమార్నింగ్

రవి , అన్నయ్యా, [ఆప్యాయంగా పిల్చాడు]

చ ॥ ఏరా రవి .... ఎలావున్నావ్?

రవి ॥ నాకేమన్నయ్యా .... బాగానే వున్నాను. మరి నువ్వూ...?

చ . కవ్విస్తూనే ఉన్నానుగదరా.

ము : బావా, ఈ ఆనంద సమయంలో విందులు, వినోదాలు ఏర్పాటు చేయడానికి, నీకు ఘనంగా స్వాగతంచెప్పే అదృష్టానికి మేము నోచుకోలేక పోయినందుకు చాలా విచారిస్తున్నాం.

చ : అందుకు నేను బాధపడడం లేదు. నాన్నగారి హత్యా వార్త నా హృదయంలో ఆరని ఆవేదనను రగిలించింది. అదే నా హృదయాన్ని క్షోభ పెడుతుంది.

ము : నీకేగాదు బావా, ఆ విచారం అందరిదీను,

చ : (బరువుగా నిట్టూర్చి) బావా,

ము : ఏమిటి బావా?

చ ॥ నాన్నగారి హత్యను గురించి నువ్వేమన్నా చెప్పగలవా?

ము : లేదు బావా?

చ : లాయర్ గారూ.

చం : యస్ సార్.

చ : గత ఎనిమిది సంవత్సరాలుగా మా వ్యాపార వ్యవహారాలు, ఆస్తి వ్యవహారాలు మీరే చూస్తున్నారుగదూ?

చం : అవునుసార్.

చ ॥ ఈమధ్య నాన్నగారేమన్నా వీలునామా వ్రాసారా?

చం ॥ వ్రాసారు.

చ : ఏమని?

చం . తమ యావదాస్థి మీకు రవిబాబుకు సమానంగా సంక్రమించేటట్లు వ్రాశారు.

చ : అందులో అవగహంఏమీలేదు రవిబాబుతో ఏకాంతంగా మాట్లాడాలి.
అన్యథా తల్చక మీరంతా బయటికి వెళ్ళండి.

(చంద్రం, అనంత్, మురళీధర్ బయటికెళ్ళారు)

అని . [లోనికి వెళ్ళింది)
రాజా॥ [బయటికి వెళ్ళాడు]

నాగ . సార్! మమ్మల్ని ఉండమంటారా వెళ్ళమంటారా?
భీమ . మనతో ప్రత్యేకంగా చెప్పాలా?
నాగ : రారా
భీమ . పదరా

[నాగన్న భీమన్న బయటికెళ్ళారు)

చ : రవిబాబూ.
రవి . ఏమిటన్నయ్యా?

చ : అనుకోని దుస్సంఘటన జరిగిపోయింది. నాన్నగారు మనకు శాశ్వతంగా దూరమయ్యారు.

రవి . అవునన్నయ్యా, ఆలోటు మనకు తీరనిది.
చ . నాన్నగారు అందరితో సఖ్యంగా మెలిగేవారు కదూ?
రవి ॥ అవును

చ : ఆయన హత్యకు వ్యక్తిగత వేధాలు కారణంకాదు. ఆయన అందర్నీ ప్రేమించేవారు. అయితే నాన్నగారు చనిపోవడానికి ఐమీన్ హత్య చేయబడడానికి ఒకేఒక కారణం కన్పిస్తుంది.

(బయట్నుంచి రాజారాం వచ్చాడు)

రవి ॥ ఏమిటది?

చ : మన ఐశ్వర్యం.

రవి . నాన్నగార్ని హత్య చేసినందువల్ల ఆస్తి మనకు దక్కుతుందిగాని మరొకంకి ఎలా దక్కుతుంది. ఆయన్ని చంపినందువల్ల ఏమిటి వుపయోగం.

చ ॥ నాన్నను చంపగలిగిన వాడికి మనల్ని చంపడం కష్టం కాదు.

రవి : ఆఁ! మనల్నా?

చ . అవును, మనమీదగూడా హత్యాప్రయత్నం జరిపచ్చు. యేమంటారు ఇన్‌స్పెక్టర్.

రాజా . అవును, నా అనుమానంగూడా అదే.

రవి . మామీద హత్యాప్రయత్నం జరగవచ్చుని మీ ఊహమాత్రమే.

చ ॥ కాదురవీ, నా మీద హత్యాప్రయత్నం జరిగింది,

రవి ॥ ఆఁ! నీమీదా?

చ . అవును. అమెరికానుంచి నేను బయలుదేరినవిమానం పేల్చడానికి ప్రయత్నాలు జరిగాయి. ఇన్‌స్పెక్టర్ రాజారాం రానున్న ప్రమాదాన్ని పసిగట్టి విమాన ప్రమాదం జరగకుండా తన సిబ్బందితో రక్షించగలిగారు.

రవి . నిజంగానా?

చ ॥ అవును, కాని ఆ దుండగులు తప్పించుకొని పారిపోయారు.

రవి ॥ ఎంత ప్రమాదం తప్పింది.

చ : ఇకముందు ఇటువంటి ప్రమాదాలు జరిగే సూచనలు కన్పిస్తున్నాయి. నీ ఆత్మరక్షణ నువ్వు చూసుకోవాలి.

రా . పోలీ, మీ ఇంటిచుట్టు బందోబస్తు పెట్టించమంటారా?

చ ॥ నోనో, ఆప్రయత్నం చేయకండి, హంతకుడు జాగ్రత్తపడతాడు

రా . అదీ నిజమే.

చ . రవిబాబూ, ఒక రహస్యం.

రవి : ఏమిటన్నయ్యా?

చ , మన భవనంలో సుమారు పదికోట్లరూపాయల విలువగల వజ్రాలు భూస్థాపితం చేయబడి వున్నాయి. ఈ విషయాన్ని నాన్నగారు ఈ మధ్యనే లెటర్‌ద్వారా నాకు తెలియజేశారు అవి మన వంశ పారంపర్యంగా వస్తున్న అమూల్యసంపద.

రవి ; అలాగా.

చ : అవి మన భవనంలో ఉన్నాయేగాని ఎక్కడున్నాయో నాకుగూడా తెలియదు, నాన్నగారి హత్యకు ఈ వజ్రాలుకూడా ఒక ముఖ్య కారణం కావచ్చు.

రవి : అవునన్నయ్యా, అస్తివిషయం ఎలావున్నా, ఈ వజ్రాలరహస్యం తెలిసిన వాళ్ళెవరో నాన్నగార్ని బెదిరించివుండాలి. నాన్నగారు ఈ రహస్యాన్ని వెల్లడి చేయనందువ హత్యచేయబడి వుండాలి.

రాజా: అవును, అదొక కారణం కావచ్చు.

చ : ఈ దురాగతాల వెనక ఒక ముఠా వుండివుండాలి.

రాజా. అవును, ఏమయినా మీ జాగ్రత్తలో మీరు ఉండాలి.

రవి : అలాగే యిన్‌స్పెక్టర్

రా : వస్తాను [వెళ్ళిపోయాడు)

చ . రవిబాబూ, ఇవి ఎవర్నీ నమ్మేరోజులు కావు; మన మిత్రులెవరో శత్రువులెవరో గుర్తించడం కష్టం.

రవి . అవునన్నయ్యా

చ : మన కుటుంబరహస్యాలు బయటి కెళ్ళాయంటే మనలో యెవరో ఆ ముఠాతో సహకరిస్తున్నారన్నమాట. సరే, వీళ్ళ ఆట కట్టించి మన సంపదను కాపాడుకోవాలి.

రవి : అలాగే అన్నయ్యా.

చ : మవ్వెళ్లు, నన్ను ప్రశాంతంగా ఆలోచించుకోని. నేను రెప్పుకొనుకో వాలి.

రవి : అలాగే (బయటికి వెళ్ళాడు)

చక్ర : అనితా!

అని : (వస్తూ) పిల్చావా బావా?

చక్ర: లేదు. అరిచాను.

అ : ఎందుకో?

చ : గలగలలాడే గాజుల గందరగోళం చేసే నీ సున్నితమైన హస్తాలతో అరకప్పు కాఫీ అమాంతం తెస్తావని.

అ : ఇప్పటికే ఆలస్యమయింది .... భోజనానికి రా బావా!

చ : ఒద్దు అనితా, కాఫీచాలు.

అ : అలా వీల్లేదు. నీకోసం నేతిగారెలు చేశాను.

చ : నిజంగానా?

అ : అవును బావా!

చ : దండచేసి మెళ్ళో వేసుకోక పొయ్యావా?

అ : పో బావా!

చ : (అనితను దగ్గరగా లాక్కొని) కోపమొచ్చిందా?

అ : ఎందుకూ?

చ : పరిహాసం చేశానని.

అ : అది మాబావ జన్మహక్కు.

చ : (మరీ దగ్గరగా లాక్కున్నాడు)

అ : ఒదులు బావా.

చ : వదలను.

అ : ఎవరన్నా చూస్తారు.

చ : చూస్తే చూడని.

అ : ఛీ .... సిగ్గులేని మేళం. చూస్తే ఏమనుకుంటారు.

చ : ఏమనుకుంటారు?

అ : పెళ్ళికాక ముందే  ఇలా ది తెగించావేమిటా అని  మాతంలు ముదుముకుంటారు.

చ : అంతేగదా ఇదే అమెరికాలో అయితే ఏంచేస్తారో తెలుసా?

అ : ఏం చేస్తారు?

చ : గట్టిగా కౌగలించుకొని ముద్దులు పెట్టుకుంటారు. ఎలాగో చూపించ మంటావా?

అ : ఒద్దొద్దు .... ఆ పనిమాత్రం చేయకు.

(అంటూ చక్రవర్తి చేతుల్లోనుంచి తప్పుకొని పాట పాడుతుంది. చక్రవర్తిగూడా పాట పాడతాడు)

(పాట - 8)  (అనిత, చక్రవర్తి డ్యూయెట్)

(పాట పూర్తయింది. అనిత చక్రవర్తి బాహువులో చేరుతుంది]

(బయటున్నుంచి నాగన్న, భీమన్న వచ్చారు. అనిత, చక్రవర్తిని చూచి ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు)

నా : ఒరేయ్ భీమన్నా

భీ : ఏమిట్రా నాగన్నా!

నా : మనసార్ ... ఈ లోకంలో లేరురా.

భీ : అవునురా.

నా : సార్, (బిగ్గరగా అరిచాడు]

(అనిత, చక్రవర్తి ఉలిక్కిపడి దూరమయ్యారు]

చ : మీరా?

నా : మేమే సార్.

అ : వీళ్ళు రాముడి అనుచరులు గదూ?

చ : అవును.

అ : వాళ్ళనెందుకు తీసుకొచ్చావు బావా!

నా ; సార్ తీసుకురాలేదు.

శి : మేమే వచ్చాం
అ : యెందుకూ?

నా : ఆ విషయం సార్‌ని అడగండి.

చ : అవును అనితా, వీళ్ళు వట్టి అమాయకులు. అగ్గిరాముడి మాయా జాలంలో చిక్కి తమ భవిష్యత్తును పాడుచేసుకుంటున్న దౌర్భాగ్యులు, గౌరవంగా కష్టపడి బతుకుతామన్నారు తీసుకొచ్చాను

నా : అవునండి కష్టపడతాం.
శి : నీతిగా బ్రతుకుతాం.

అ : మీరా, బ్రతకాల్సిందే... అయినా ముగ్గురు దొంగల్లున్నారు వాళ్ళతో పనిలేదు. ఇంకా వీళ్ళెందుకు బావా?

చ : ఉందని, చూడు అనితా. తప్పుచేయడం మానవ సహజం. చేసిన తప్పు తెల్సుకొని మంచి మార్గానికి మళ్లాలనుకోవడం ఉత్తమ లక్షణం. మనిషిమారడానికి అవకాశం ఇవ్వాలేగాని వారిని శిక్షించినందువల్ల ప్రయోజనం లేదు.

నా : అవునండి.
శి : నిజమండి

చ : నిజానికి వీళ్ళిద్దరూ దొంగలు, మామూలు దొంగలుగాను. అగ్గిరాముడితోపాటు ఎందరినో కొల్లగొట్టిన బందిపోటు దొంగలు. ఈనాడు తమతప్పు తెల్సుకొని మంచి మనుషులుగా మారడానికి వచ్చేశారు.

నా : అవునండి.
శి : నిజమండి.

అ : నీ ఇష్టాన్ని కాదనను, పాతఅలవాటు ప్రకారం మనింట్లో వస్తువులు కాజేస్తే......?

వా : మేము డబ్బుతప్ప వస్తువులు ముట్టుకోమండి.
బీ : అవకాశం దొరికితే డబ్బుమాత్రమే కాజేస్తామండి.

అ : విన్నావా బావా.

చ : వాళ్ళమొహం ... అయినా ఇనప్పెట్టెలోనున్న డబ్బు వీళ్ళకెలా అందుతుంది,

వా : ఆ భయం మీకక్కరలేదు.
బీ : మారుతాళాలతో ఇనప్పెట్టెలు తెరవటం మాకువెన్నతో పెట్టినవిద్యండి

అ : మనకొద్దు ... పంపెయ్ బావా.
చ : పంపితే యెక్కడికెళతారు?

బీ : అవునండి.
వా : నిజమండి.

చ : మీకు వంటపని తెలుసా?
వా : తెలుసండి

బీ : ఇంతకుముందు ఇన్‌స్పెక్టర్ జనరల్‌గారింట్లో వంటపని చేశామండి.

వా : పనిచేసిన నాలుగురోజులలో ముగ్గుర్ని పంపామండి.
అ : పైకేనా?

వా : కాదండి, హోటల్ భోజనానికి.
చ : ఏడ్చారు లెండోయ్.

వా : మేము ఏడ్వలేదండి .... ఏరా నువ్వేమన్నా ఏడ్చావా?
బీ : లేదురా ... నువ్వేడిచావేమోనని నేననుకుంటున్నాను.
చ : అవితా!
అ : ఏమిటి బావా?
చ : మనం అలా లాయర్‌గారి ఇంటికి వెళ్దాం రా.
అ : ఇప్పుడా?

ఆ : అవును? ఆయనతో చాలా విషయాలు మాట్లాడాలి.

అ : సరే పద.

[బయటికి వెళ్ళబోయారు. బయట్నుంచి రవికాంత్ ప్రవేశించాడు]

ర . ఎక్కడికన్నయ్యా?

చ : లాయర్ గారింటికి ... అన్నట్టు ... ఇనప్పెట్టె తాళాలు మీ దగ్గరే ఉన్నాయిగదూ.

ర : అవును.

చ . ఇలా ఇవ్వు.

(రవి ఇనప్పెట్టె తాళాలు చక్రవర్తికిచ్చాడు. అనిత, చక్రవర్తి బయటికెళ్ళారు. రవికాంత్ బయటికి వెళ్ళాడు. నాగన్న, భీమన్న లోనికి వెళ్ళారు)

(కొన్ని క్షణాలు మ్యూజిక్ తో గడిచాయి. బయట్నుంచి మురళీధర్, చంద్రం, ఆనంద్ వచ్చారు)

ము: (సోఫాలో కూర్చుని సిగరెట్ దమ్ము లాగుతుంటాడు)

(చంద్రం, ఆనంద్ అటూ యిటూ తిరుగుతుంటారు)

చం: (ఆగి) నువ్వన్నది అక్షరాలా నిజం. చక్రవర్తి సామాన్యుడుగాదు. అవులిస్తే ప్రేవులు లెక్కపెట్టేరకం.

ఆ : అవును. అతన్ని ఆడించడం మనవల్లగాదు.

చ : అతడే మనల్ని ఆడించగలడు.

ము : అటువంటివాడితో నేస్తం చాలాప్రమాదం అందుకేవాడ్ని తొలగించాలి.

చ : అదే మందిది.

అ : మనవ్యాపారం నిరాటంకంగా సాగి పోవాలి. ఆస్తి మనం దక్కించు
కోవాలంటే వాడ్ని సఫాచేయక తప్పదు.

చ : అవును.

(బయట్నుంచి ముసుగుమనిషి ప్రవేశించాడు)

ము : బాస్ .... మీరా?
చ : గుడ్‌మార్నింగ్ బాస్
అ : గుడ్‌మార్నింగ్ బాస్

ము : బాస్ .... మీరిలా రావడం ప్రమాదం... ఎవరయినా చూస్తే కొంప
మునుగుతుంది.
ము : (మురళికి దగ్గరగా రమ్మని సిగ్నల్ ఇచ్చాడు)
ముర. (ముసుగుమనిషి దగ్గరగా వచ్చాడు)
ముసు:(మురళిచెవిలో ఏదో చెప్పాడు)
ము : అలాగే బాస్ .... అలాగే చేస్తాను.

(ముసుగుమనిషి బయటికి వెళ్ళిపోయాడు)

చ : ఏమంటున్నారు బాస్?

ము : అనడానికి ఏముంది. రవికాంత్‌ను ఎలాగయినా లొంగదీసి అనితతో
పెళ్ళి జరిపించాలట. బలరాంను పిలిపించి చక్రవర్తిని అడ్డు తొల
గించాలట.

అ : ఇంకా ఆలస్యం దేనికి? ఊం ... కానివ్వు.

(మురళీధర్ టెలిఫోను రిసీవర్ఎత్తి నెంబర్ డయల్ చేశాడు].

ము : (ఫోనులో) హలో! త్రీస్టార్ నైట్‌క్లబ్. మిస్టర్ బలరాంగారిని.
ఒకసారి పిలుస్తారా?

బ : (వస్తూ) నేను వచ్చేశాను మురళీధర్.

ము : బలరాం ... నువ్వా ...? [వాకిలివంక చూచాడు)

బ : వచ్చేశాను. నాతో నీకు అవసరం ఉంటుందని నాకు తెలుసు అం దుకే పిలవని పేరంటానికి వచ్చేశాను నీ పరిస్థితులు నాకు తెలుసు. డాక్టర్ చక్రవర్తి అమెరికానుంచి తిరిగివచ్చాడు. నువ్వూ నీబాస్ అతను వస్తున్న విమానాన్ని ధ్వంసం చేయాలని ప్రయత్నించారు. రానున్న ప్రమాదాన్ని గ్రహించిన ఇన్‌స్పెక్టర్ రాజారాం తనసిబ్బందితోదాకి ప్రమాదాన్ని తప్పించాడు అవునా?

ము : ఇదంతా నీకెలా తెలుసు?

బ : బలరాంకు వెయ్యికళ్ళు మురళీధర్.

ము : నీ తెలివి అమోఘం.

బ : చక్రవర్తిని అడ్డు తొలగించడానికి నా అవసరం నీకుంటుందని తెలుసు. అందుకే వచ్చాను. ఏమంటావ్?

ము : తొలగించగలవా?

బ : అదినాకు వెన్నతో పెట్టినవిద్య.

ము : వాడ్ని ఎలాచంపుతావ్?

బల : విజయేంద్రభూపతిని చంపినట్టే.

ము : అంత సులభంగాదు

బల : నాకు అసాధ్యమన్నది లేదు.

ము : నువ్వే పట్టుబడితే?

బల : కలలోని మాట.

ము : ఒకవేళ చక్రవర్తి నిన్నుగుర్తించి పట్టుకుంటే....?

బల : జరగనివని... ఒకవేళ జరిగినా మీ రహస్యాలు బయటికిరావు.

చం : అదీ అలావుండాలి.

అ : పొరపాటునన్నా మా పేర్లు బయటికి రాగూడదు.

ము: ఏమంటావ్?

బిల: మీ రహస్యాలు రహస్యంగానే ఉంచబడతాయి.

ము: వెరీగుడ్, మరి ... నీ ప్రతిఫలం

బిల: ఐదులక్షలు

ము: ఆ! ఐదులక్షలా!

బిల: అవును ఐదులక్షలు ... ఫైవ్‌లాక్స్

ము: ఇటీజ్ టూమచ్.

బిల: [నవ్వి] కోట్లకొలది ఆస్తి, పదికోట్ల విలువగల వజ్రాలు పొంద గోరేవారు ఐదులక్షలు పారేయడం సముచితం. చక్రవర్తిప్రాణం విలువ కోట్లసంఖ్యలో వుంది.

ము: ఆల్‌రైట్. పని ఈరాత్రికే జరగాలి.

బిల: చెప్పలేను. ఈరాత్రి ప్రయత్నం జరుగుతుంది. తప్పితే రేపు చక్రవర్తి తల తెగుతుంది

ము: (పాకెట్‌లోని నోట్లకట్టలు తీసి ఐదుకట్టలు బిలరాంకిస్తూ] అడ్వాన్సు

బిల: ఎంత?

ము: పాతికవేలు. మిగతాది పనిముగిసిన తర్వాత.

బిల: ఓకే.

ము: నువ్వెళ్ళొచ్చు.

బిల: [నవ్వి] ఓకే ... (అంటు పాకెట్‌లోనుండి బ్రాంది బాటిల్ తీసి త్రాగబోయాడు)

ము: స్టాపిట్.

బిల: (ఆగాడు]

ము: ఆ బాటిల్ కావాలి.

బిల: దీని వెల 12 రూ॥లు

ము: (జేబులోని వందకాగితం తీసియిస్తూ) ఇదిగో పంద

(దిండ్లాల వంక కాగితాన్ని అందుకొని బ్రాందీబాటిల్ మురళీధర్
కిచ్చి బయటికి వెళ్ళిపోయాడు)
[మురళీధర్ బాటిల్‌వంక ఒకసారి చూశాడు)

ఆ : ఈ బ్రాందీబాటిల్ దేనికో?

చ . త్రాగడానికి.

ఆ : అంతేనా?

ము : కాదు.

చ . మరి?

ము . ఉచ్చులో రవికాంత్‌ను బంధించడానికి.

చం
ఆ . ఆఁ! [నోళ్ళు తెరిచారు]

[మురళీధర్ లోని వాకిలివద్దనున్న టేబిల్‌మీదిగ్లాసులలో బ్రాందీ
నింపాడు. బయట్నుంచి రవికాంత్ ప్రవేశించాడు)

ము . [రవినిచూచి నవ్వాడు]

రవి. ఏమిటానవ్వు? ఎందుకలా నవ్వుతావ్?

ము . నీ దురదృష్టాన్ని చూచి,

రవి. ఏమన్నావ్?

ము , అవును బాబా! మీ అన్నయ్య తిరిగివచ్చాడు ఈ ఆస్తికి సగభాగ
హక్కుదారై ఉంటేగూడా మీఅన్నయ్య అధికారంతో దానిసర్వాధికారి

రవి. నేనంటే అన్నయ్యకు ప్రాణం.

ము . అదంతా నటన.

రవి. ఏమన్నావ్?

ము . అవును. తన ఆస్తితోపాటు నీ ఆస్తిమీద గూడా అధికారాన్ని చెలా
యించాలని మీ అన్నయ్య ప్లాను.

రవి. నీకెలా తెలుసు.

ము . (నవ్వి] రవిబాబు అమాయకుడవి, సునాయాసంగా తనను నమ్మి

తావి, ఆ అవకాశాన్ని ఆధారం చేసుకొని నీ ఆస్తినిగూడా తనే దక్కించుకోవాలని ప్లాన్ వేశాడు అనితతో చెప్పడం నా చెవులారా విన్నాను.

రవి, ఆఁ,

ము. నేనేగాదు, లాయర్ చంద్రశేఖర్‌గారు, డాక్టర్ ఆనంద్‌గారు గూడా విన్నారు. ఏమంటే మాట్లాడరే?

చం : అవునవును. విన్నాం.

ఆ , తమ్ముడ్ని అన్యాయం చేయాలనుకోవడం అధర్మం.

రవి : ఇదంతా నిజమా?

ము . అబద్ధం చెబితే నాకొచ్చేదేమిటి?

రవి . అన్నయ్య ఇంతటి స్వార్థపరుడా?

చం : కాకుంటే నీకింతటి అన్యాయంచేయ సంకల్పిస్తాడా?

ము : రవిబాబు. నీమీదున్న అనురాగంకొద్దీ మామయ్య తన ఆస్తిలో నీకు వాటా యిచ్చాడు! దాన్ని పోగొట్టుకొని అనాథుడివి కాకు.

రవి : నమ్మలేక పోతున్నాను,

ము . మీ అన్నయ్యమీద నీకున్న అనురాగం నమ్మనీదని నాకుతెలుసు, పిచ్చివాడా! నీస్వాధీనంలో వున్న ఇనప్పెట్టె తాళాలు తీసుకున్నాడా లేదా?

రవి . తీసుకున్నాడు.

ము . ఎందుకు తీసుకున్నాడంటావ్ .... ఏం? ఆ తాళాలు నీ దగ్గర ఉండకూడదా?

చం : ఉండకూడదనే చక్రవర్తి అభిప్రాయం.

ము . యిప్పటికయినా కళ్ళుతెరు. నీఆస్తిని పంచుకొని దూరంగావెళ్ళిపో.

రవి : వెళతాను. కన్నకొడుకును కాకపోయినా నాన్న నామీదున్న ప్రేమతో ఆస్తిలో సగభాగం వ్రాసిచ్చారు. దాన్ని కాజెయ్యడానికి అన్నయ్యకు హక్కులేదు. ఇప్పుడే తెగతెంపులు చేసుకుంటాను.

ము. భయపడకు: మేమంతా నీ క్షేమాన్ని కోరేవాళ్ళం. మా అండ నీకెప్పుడూ ఉంటుంది, వస్తాం.

[మురళీధర్, చంద్రం, ఆనంద్ బయటికెళ్ళారు]

రవి. (అటూయిటూ తిరుగుతూ] అన్నయ్యా, నువ్వింతటి స్వార్థపరుడివా నీ కోసం, నీ క్షేమం కోసం అనితమీదున్న ప్రేమను తెంచుకున్నాను, తండ్రి తరువాత తండ్రి అంతటివాడివని గౌరవించాను. నా మనసులో దేవుడిగా నిల్పి ఆరాధించాను. అందుకు ప్రతిఫలం ఇదా? వీల్లేదు. ఆస్తిలో నావాటా నాకు కావాలి. అనిత నాసొంతం కావాలి. దక్కించుకుంటాను, ఆస్తినీ, అనితనూ దక్కించుకుంటాను నువ్వెలా అడ్డు పడగలవో చూస్తాను.
[అంటూ టేబుల్ మీదున్న బ్రాందీని చూసి అన్ని గ్లాసులు ఖాళీ చేస్తాడు. కొద్దిమైకంలో ఉంటాడు]

రవి: అన్నయ్యా.... కాదు, నువ్వు అన్నయ్యవు కాదు. నా శత్రువివి. నా కన్యాయం చేయ సంకల్పించిన నిన్ను సర్వనాశనం చేస్తాను.

[బయట్నుంచి అనిత ప్రవేశించింది)

రవి : అనితా!

అని. ఏమిటి బావా?

రవి. రా అనితా (చెయిపట్టుకున్నాడు)

అని. బావా... ఏమిటిది? [చెయ్యి లాక్కుంది]

రవి. నా మనసు నీ కర్థం కాలేదా అనితా, ఐ లవ్ యూ.

అని. నో .... ఐ డోంట్ లవ్యూ.

రవి. వాట్?

అని. యస్.

రవి. అనితా, నన్నెందుకు ప్రేమించలేవు?

అని. పెదబావను ప్రేమించాను గనుక.

రవి. వీల్లేదు, నువ్వు వాడ్ని ప్రేమించడానికి వీల్లేదు.

అని : అది నా ఇష్టం.

రవి. నీ యిష్టంతో నిమిత్తంలేదు.

అని. వదలడానికి నువ్వెవరు?

రవి. నీకు కాబోయే భర్తను.

అని. తాగి మాటాడుతున్నావా?

రవి. తాగినా తాగకపోయినా జరిగేది అదే. నీ పొగరు తగ్గితే నీ మొగుణ్ణి అవుతాను.

అని. అనిత బలిపశువు గాదు.

రవి. అనితా! నాలో రాక్షసత్వాన్ని రెచ్చగొట్టకు. మర్యాదగా నన్ను పెళ్ళిచేసుకోడానికి ఒప్పుకో. లేకపోతే నీ మెడలో తాళికడతాను.

అని. జరగనివని.

రవి. అంతేనా?

అని. అంతే.

రవి. నన్ను పెళ్ళిచేసుకోడానికి ఒప్పుకోవా?

అని. ఒప్పుకోను.

రవి: సరే! నాకు దక్కనిది ఇంకెవ్వడికిగూడా దక్కకూడదు. నన్ను మోసంతో నాశనం చేయజూచిన అనయవంచకుడు నీ భర్త కావడానికి వీలులేదు. నా [అంటు చెయ్యి పట్టుకున్నాడు]

అని. వదులు, వదులు (తప్పించుకో చూస్తుంది]

రవి. పట్టుకున్నది వదలడానికిగాదు నీ అంతు చూడడానికి. నిన్ను లొంగదియ్యడానికి.

అని. [చెయ్యిలాక్కొని] బలవంతం చేస్తావా, పశువా?

రవి. మంచిగా వినకపోతే బలవంతం తప్పదు నా. (అంటూ అనిత రెండుచేతులూపట్టుకొని దగ్గరగా లాక్కోవాలని ప్రయత్నిస్తాడు)

అని, వదులు, రవిబాబు, వదులు, [తప్పించుకో చూస్తుంది]

రవి. హ్హా, హ్హా, హ్హా, హ్హా...

అని. వదులు. బావా,. నీకు పుణ్యముంటుంది వదులు.

స్తూంది ఆ ఆకారం పిల్లిలా చక్రవర్తిని సమీపించి చంప బోయింది. చక్రవర్తి గమనించి ముసుగుమనిషి రెక్క పట్టుకొని మెలితిప్పాడు.)

ము : (చేతిలో కత్తి వదిలాడు)

చ : (ముసుగుమనిషి ముఖంపై కొట్టాడు.)

ము : (దూరంగా పడ్డాడు)

చ : (కింద పడిన కత్తి అందుకొని బయటినుంచి అడ్డంగా నిల్చున్నాడు

ము : (లేచి నిల్చున్నాడు)

చ : ఎవరు నువ్వు?

ము : నీ ప్రాణం తీయవచ్చిన పిశాచిన్ని.

చ : భేష్! బలేవీరుడవు

ము : అనుమానమా?

చ : అందుకే నిరాయుధంగా నిద్రిస్తున్న నన్ను చంప వచ్చావు. ఇది వీర లక్షణమా?

ము : శత్రువులను తొలగించడమే నా ధ్యేయం.

చ : దానివల్ల ఉపయోగం.

ము : ఇదే లక్షణం.

చ : నా ప్రాణం తీయడానికి నియమించబడ్డావన్నమాట.

ము : అవును, కాచుకో.

(అంటూ చక్రవర్తి మీద కలబడ్డాడు. కొన్ని నిముషాలు ఇద్దరిమధ్య ఫైట్ జరిగింది. ముసుగుమనిషి ముఖానికున్న ముసుగు చక్రవర్తి చేతిలోకి వచ్చింది.)

చ : (ముసుగు మనిషి ముఖం చూసి) బలరాం.... నువ్వా!

బ : ఎవరూ?

చ : నేనే.. నన్ను గుర్తించలా?

బ : ఆఁ... అగ్గిరాముడు.

చ : అప్పటి బలరాం. అగ్గిరాముడ్ని.

బ : సర్దార్! ఏమిటీవేషం?

బ : ఇప్పుడు సర్దార్! అతని శవాన్ని పోస్టుమార్టంకోసం పంపడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. చాటుగా చూచి నేను తప్పుకున్నాను.

వ : అలాగా!

బ : అయితే భూపతిని ఎవరుచంపి ఉంటారు?

చ : ఇంకెవరు? ఆ మురళీధరే చంపి ఉంటాడు. వాడు చాలా ప్రమాదకరమైన వ్యక్తి.

బ : మానకన్నానా?

చ : కీడెంచి మేలెంచమన్నారు, బలరాం.... అనితను నాభార్యగాచేసుకొని ఆస్తి స్వాధీనమయ్యేవరకు మాత్రం మురళీధర్ అనుచరుడిగానే నటించు.

బ : అలాగే సర్దార్.

(లోపలినుంచి అనిత వచ్చింది)

అ : బావా! నువ్వింకా నిద్రపోలేదా... (బలరాంను చూచి) ఇతనెవరూ

వ : నా స్నేహితుడు. నేను అమెరికానుంచి వచ్చానని తెలిసి చూడడానికి వచ్చాడు.

అ : కాఫీ తెస్తాను కూర్చోండి

బ : ఒద్దు మేడం. రేపు ఎలాగూ మావాడిపార్టీకి ఇవ్వక తప్పదుగా. వస్తానురా చక్రం వెధవా.

అ : అదేమిటి

చ : ఓ... అదా.... ఈ వెధవకు నన్ను వెధవాఅని పిలవడం ఒక వెధవ అలవాటు

బ : వస్తానురా (బయటికి వెళ్ళాడు)

అ : దొరగారికింకా నిద్ర రాలేదా?

చ : దొరసాని జోల పాటలేదుగా (దగ్గరగా లాక్కున్నాడు)

అ : ఛీ! వదులు బావా!

చ : వదలను మరదలా.

(అనిత తప్పించుకుని పోబోయింది. చక్రవర్తి ఆమె చీరచెంగు పట్టుకున్నారు)

(చక్రవర్తి పాట పాడ్తాడు. అనిత అతన్ని అనుసరించింది)

(పాట : 7) (చక్రవర్తి, అనితడ్యూయెట్)

(పాట పూర్తయింది అనిత చక్రవర్తి హృదయంపై వాలింది ఇద్దరూ ఏకమై విల్పిపోయారు)

[తెర జారుతుంది]

# నాలుగవ రంగం

[అది విజయేంద్ర భూపతి భవనంలో హాలుగది. అలంకరణంతా మొదటిరంగం లాగానే ఉంటుంది. మార్పేమీ వుండదు. శేదిపాయముందు టేబుల్ మీద భూపతి ఫోటో వుంటుంది.]

[తెరలేచింది)

[రవికాంత్ భూపతి ఫోటోముందు నిలబడి విచా స్తుంటాడు]

రవి : నాన్నా! నీ కన్నబిడ్డను కాకపోయినా ఎంతో ఆప్యాయంగా పెంచావు. ఆస్తిలో భాగమిచ్చావు. నాకు జన్మనిచ్చిన నా తలిదండ్రులు కఠిన పాషాణులై పారవేసిన నన్ను ఆప్యాయతతో ఆదరించావు. మనిషిగా తీర్చిదిద్దావు. ప్రేమానురాగాలు రంగరించి పోశావు. నీ ప్రేమకు ప్రతిఫలంగా నీ బిడ్డనే అవమానించావు. అన్నయ్యను నిందించాను. నిజానికి నేనెవర్ని. ఏమో, దిక్కులేని దరిద్రనారాయణుడ్ని. నన్ను క్షమించు నాన్నా. చూశావా నాన్నా. మళ్ళీ నాకిచ్చిన ఆస్తికోసం అన్నయ్య నన్ను మోసం చెయ్యాలనుకుంటున్నాడు. నిజానికి ఈ యావదాస్తి అతనిదేగా. నన్నడిగితే నేను కాదంటానా? అందుకే యావదాస్తి అన్నయ్యకు వదిలి కట్టుబట్టలతో వెళ్ళిపోబోతున్నాను. అన్నయ్యకు నా ముఖాన్ని చూపలేను. నావల్ల ఏదయినా అపరాధంజరిగితే నన్ను క్షమించునాన్నా.

(లోపల్నుంచి అనిత, చక్రవర్తి వస్తారు)

రవి : వెళ్ళొస్తాను నాన్నా.

చ : ఎక్కడికి?

ర : అన్నయ్యా!

చ : ఎక్కడికెళుతున్నావురా?

ర : నా గమ్యస్థానానికి.

చ : రవీ! నిజంగా వెడుతున్నావా?

ర : అవును.

అ : బావా!

రవి : అవును అనితా. నాకీ ఇంట్లో స్థానంలేదు.

శ : అలాగని నువ్వనుకుంటున్నావు.

రవి : నిజంగూడా అదే.

శ : ఏమిటా నిజం?

రవి : నేను నీ రక్తాన్ని పంచుకుపుట్టిన తమ్ముణ్ణి కాదు.

శ : ఆ విషయం నాకు తెలుసు.

రవి : అన్నయ్యా.

అ : అవును బావా. పెదనాన్నకు అంతా తెలుసు. రాత్రి నీ తప్పు మైకం వల్ల జరిగిందేనని తెలుసు.

రవి : అనితా!

శ : రవీ, అనిత నీ కాబోయే వదిన. కాబట్టి నువ్వామెను రాత్రి అవమానించలేదు, నిన్ను ఆవహించిననిషా అలాచేయించింది. అంతే. కావాలని నువ్వు అలా ప్రవర్తించవు. ప్రవర్తించలేవు. నిన్ను ఎవరో చెడుమార్గాన పట్టించాలని అలాచేశారు.

రవి : అన్నయ్యా!

శ : రక్తం పంచుకొని పుట్టినంతమాత్రాన నా తమ్ముడివి కాకపోవు. ఒరేయ్. ఏతల్లి చల్లనిఒడిలో పెరిగానో, ఆతల్లి ఒడిలోనే నువ్వూ పెరిగావు. అది చాలురా మనం అన్నదమ్ములమనిపించుకోడానికి.

రవి : అన్నయ్యా (అంటూ పరుగెత్తి కాళ్ళమీద పడ్డాడు)

శ : లేరా (లేపాడు)

రవి : నన్ను క్షమించన్నయ్యా ... నిన్ను అపార్థం చేసుకున్నాను.

శ : పొరపాటు మానవులకు సహజం.

రవి : అనితా!

అ : ఏమిటి బావా?

రవి : చెప్పుడు మాటలకు మనుషులు యిట్టే లొంగుతారన్నది నిజం. నీ పట్ల నా ప్రవర్తన అతినీచం. నన్ను మన్నించు అనితా.

అ : వెళ్ళిపోయారే బావా

వ : రవీ!

రవి : ఏమిటన్నయ్యా?

వ : నువ్వు నాకో మాటివ్వాలి.

రవి : చెప్పన్నయ్యా. నీమాట పాటించలేకపోతే నా జీవితానికి అర్థంలేదు!

వ : నువ్వు ఏనాడూ త్రాగనని మాటివ్వు.

రవి : త్రాగుడువల్ల జరిగే అనర్థాలు ఎలాంటివో నాకు తెలుసన్నయ్యా. కాని —— మంచితనాన్ని చూచి ఓర్వలేని కుత్సితుల మాటలకు లొంగి ఆ పాడుపని చేశాను. మళ్ళీ జీవితంలో ఏనాడు త్రాగను.

వ : నిజంగానా?

రవి : అవునన్నయ్యా. (చేతిలో చెయ్యివేసి) ఇదిగో ప్రమాణం చేస్తున్నాను.

వ : తమ్ముడూ!

రవి : అన్నయ్యా .... నేనలా బయటికి వెళ్ళొస్తాను.

వ : మంచిది.

రవి : (బయటికెళ్ళాడు)

వ : అనితా.

అ : ఏమిటి బావా?

వ : తమ్ముడు జారిపోయాడని బాధపడ్డాను. మన కుటుంబగౌరవం బజారు పాలవుతుందని భావించాను. లక్షలలో నా తమ్ముడు ఒకడు, మా అనుబంధం రామలక్ష్మణుల అనుబంధం.

అ : అవును బావా! చినవాడికి నువ్వంటే పంచప్రాణాలు.

వ : మరి నీకో?

అ : నాకూ అంతే.

వ : (దగ్గరగా రాబోతూ) నిజంగానా?

అ : అనుమానమా?

చ : నిజంగా నువ్వు స్వార్థపరురాలివి.

అ : బావా!

చ : కాదంటావా? నేను కోటీశ్వరుడిననే నన్ను ప్రేమిస్తున్నావు గదూ!

అ : బావా.

చ : నీ తండ్రి పుట్టుకతో దరిద్రుడు. నీ వంశంలోని వారందరూ అణా మకాలు ఒక్కసారిగా అందలమెక్కాలని, ఐశ్వర్యాన్ని అందుకోవాలని నన్ను ప్రేమిస్తున్నావు

అ : బావా! (ఏడుస్తుంది)

చ : ఆహా .... ఎంతబాగా నటిస్తున్నావు అనితా. నువ్విలా సినిమాలలో నటిస్తే ఆ చిత్రాలన్నీ సెంచరీ సృష్టిస్తాయి.

అ : బాగుబావా బాగు. నిజంగానే నేను నటిస్తున్నాను. నీ ఐశ్వర్యాన్ని అందుకోవాలని ఆశ పడుతున్నాను. నా దరిద్రాన్ని నిర్మూలించుకోవాలని నీ భార్యను కావాలనుకున్నాను. నా అంతర్యాన్ని అర్థం చేసుకున్నావు. (ఏడుస్తుంది)

చ : అనితా.

అ : అవును బావా. నువ్వన్నది నిజం. అయినా నువ్వెక్కడ? నేనెక్కడ? ఉల్లిపూవు మల్లెపూవు అవుతుందా? వస్తాను (కన్నీళ్ళు తుడుచుకుంటూ లోనికెళ్ళబోయింది]

చ : అనితా!

అ : (ఆగింది)

చ : ఏడుస్తున్నావా?

అ : లేదు. నువ్వన్న మాటలకు ఆనందిస్తున్నాను. బాలబావా! నువ్వు అన్న మాటలకు నామనసు ఆనందంతో మునిగిపోయింది.

చ : అనితా!

అ : వస్తాను [వెళ్ళబోయింది]

చ : (ఆమె చీరకొంగు పట్టుకున్నాడు)

అ : (చక్రవర్తి కళ్ళల్లోకి చూస్తుంది)

చ : (నవ్వి) తమాషాకు అన్నమాటలకు ఏడుస్తున్నావా?

అ : బావా,

చ : నీ మనసు నాకు తెలియదా అనితా, నిన్ను ఉడికించాలని అలా అన్నాను. యింతమాత్రానికే కన్నీరా?

అ : నవ్వుతూ అన్నా యిలాంటిమాటలు హృదయాన్ని గాయపరుస్తాయి బావా!

చ : పిచ్చిదానా. నీ బావను అర్థం చేసుకున్నది యింతేనా?

అ : బావా!

చ : ఈ బావ ఏనాటికి నీవాడు నీదనే కోరుకుంటాను అనితా!

అ : బావా!

చ : అనితా (దగ్గరగా లాక్కున్నాడు]

అ : మళ్ళీ ఎప్పుడూ అలా అనకు బావా. నేనేమైపోతానో.

చ . ఏమైపోతావ్?

అ : చచ్చిపోతాను,

చ : అనితా!

అ : అవును బావా. నువ్వు కాదంటే నాకు మృత్యువే మార్గం.

చ : నిన్ను కాదనేదిలేదు, నువ్వు మృత్యువును కోరుకునేది లేదు.
(అంటూ దగ్గరగా లాక్కున్నాడు అనిత సిగ్గుపడుతుంది)

[చక్రవర్తి పాటపాడతాడు. అనిత అతన్ని అనుసరించింది]
[పాట- 7] [చక్రవర్తి అనిత డ్యూయెట్]
[పాటయిపోయింది. అనిత చక్రవర్తి ఒడిలో వాలిపోయింది]

చ : అనితా.

అ : వూఁ.

చ : నీ మనసు యేమంటుంది?

అ : ఈజీవితం ముగిసేవరకూ ఇలాగే నీకౌగిలిలో కరిగిపొమ్మంటుంది

చ : మరి నా మనసేమంటుందో తెలుసా?

అ : యేమంటుంది?

చ : సాధ్యమయినంత త్వరగా నీమెళ్ళో తాళి కట్టమంటుంది.
అ : నేను కాదన్నానా? వద్దన్నానా?
చ : అంటే నేనే ఆలస్యం చేస్తున్నానంటావ్?
అ : అవును.

[విసుక్కుంటూ ఇన్‌స్పెక్టర్ రాజారాం ప్రవేశించాడు)

చ : కమాన్ యిన్‌స్పెక్టర్.
రా : మీతో ఒక విషయం మాట్లాడాలి.
చ : యేమిటది?
రా : చాలా రహస్యం.
చ : పర్వాలేదు చెప్పండి.
రా : అనాదిగా మీ వంశం సకల ప్రతిష్ఠలతో గౌరవ మర్యాదలతో విరాజిల్లుతుంది. దాన్ని నామరూపాలు లేకుండా విక్రయిస్తున్నాడు.
చ : ఎవరు?
రా : యింకెవరు? మీ తమ్ముడు రవిబాబు.
చ : ఆఁ!
రా : అవును.
చ : మళ్ళీ త్రాగుడు ప్రారంభించాడా?
రా : అంతటితో ఆగితే సరిపోయేది. ఇలాగండి. [చెవిలో ఏదో చెప్తాడు]
చ : ఆఁ!
రా : అవునండి, తెలియజేయటం నా బాధ్యతగా ఎంచి వచ్చాను.
చ : తమ్ముడు హద్దు దాటిపోయాడు యిన్‌స్పెక్టర్ గారూ.
రా : అవును.
చ : వాడిప్పుడు యెక్కడున్నాడు?
రా : యింకెక్కడుంటాడు. ఉండాల్సిన చోటే. ఆ కొంపలోనే. అబ్బో ....
ఆ జల్సాలు..... గానాబజానాలు ... విందులు ... వినోదాలు ....
చెప్పలేం.
అ : యేమయింది బావా?

రా. ఏమౌతుంది ఉడుకురక్తం గదూ. ఏమైనా చేయిస్తుంది.
చ. ఇన్‌స్పెక్టర్ పదండి .... వాడెక్కడున్నాడో నాకు చూపించండి.
రా. కమాన్.

(చక్రవర్తి, రాజారాం బయటికి వెళ్ళారు)

అ. (విద్యార్థి కూర్చుంది]

[లోపలినుంచి నాగన్న, భీమన్న వచ్చారు]

అ. వచ్చారా?
నా. వచ్చాం.
భీ. వచ్చేశాం.
అ. ఏమిటో చెప్పండి.
నా. నాకొక సందేహం.
భీ. అదే జబ్బు నాకు గూడా.
నా. ఇవ్వాళేం చేయమంటారు వేపకాయ ఇగురా?
భీ. కుంకుడుకాయల పులుసా?
నా. పందికొక్కు పులుసా?
అ. ఛీ!
నాగ. ఛీ అనకండి. భారతదేశంలో కోట్లాది ప్రజలు అతి ఆప్యాయంగా ఆరగించే పులుసు. ఉచికి నుచికి మారుపేరు.
భీమ. బోసి పల్లులదారు చేయమంటారా?
అవి. ఛి ఛీ.
భీమ. మీరు అలా అనకూడదు. పదిరూపాయలు పారేస్తే కిలోచక్క మాంసం దొరికే ఈ రోజుల్లో వెయ్యిరూపాయలు యిచ్చినా కిలో పల్లిలు దొరకడం కష్టం.
నాగ. మీ కోసం ....
భీమ. మీ మీదున్న ప్రేమకోసం.
నాగ. మీ మీదున్న అనురాగం కోసం.
భీమ. మీ ఆరోగ్యం కోసం.

నాగ : నారాయణపురం నల్లులపాలెం నుంచి పదికేజీలు తెప్పించాను.
ప్రత్యేకంగా మీ కోసం.

అని . [కోపంగా] ఛీయ్.

నాగ : [భీమన్న చొక్కాపట్టుకుని] ఏయ్ ఏమిట్రా పని జాగ్రత్తగా పలుకు.

భీమ . [నాగన్న చొక్కాపట్టుకుని] పనీ ఏమిట్రా పని జాగ్రత్తగా పలుకు.

నాగ . హూం. [చొక్కా వదిలాడు]

భీమ . హూం. [అంటూ చొక్కా వదిలాడు]

నాగ . చెప్పండి. ఏం చెయ్యమంటారు?

భీమ . మీరు ఊం అంటే చాలు రష్యానుంచి కప్పలు తెప్పించి దారుకాస్తాం.

అని . ఛీ ఛీ ... మీరేం చేయనక్కర్లేదు. క్యారేజి తెప్పించుకుంటాం.

నాగ . మీరు తెప్పించుకుంటారు సరే. మరి మేమేం తినాలి?

అని . ఆ పందికొక్కుపులుసు ఒకరు నల్లులచారు ఒకరు తినండి వెళ్ళండి

నాగ . నల్లులచారు పీకు.

భీమ . పందికొక్కు పులుసు పీకు.

[ఇద్దరూ లోపలికెళ్ళారు]

అని . అబ్బా, ఇద్దరూ ఇద్దరే. ఖర్మ. దొరికినందుకు చెప్పుకోవాలి.
[అంటూ లోపలికెళ్ళింది]
[బయట్నుంచి బలరాం, చక్రవర్తి వచ్చారు]

బల . ఏది ఏమైనా మిమ్మల్ని చంపాలని ప్లాన్ వేస్తున్నారు సర్దార్.

చక్ర. బలరాం.

బల . సర్దార్.

చక్ర. మీ సర్దార్ పేరేమిటి?

బల . అగ్గిరాముడు.

చక్ర. అగ్గి అంటే నిప్పు. తెల్సిందా. అగ్గిరాముడుతో శత్రుత్వాన్ని కోరుతున్నారంటే నిప్పుతో చెలగాటమాడుతున్నారని తెల్సుకో.

బల . అదికాదు సర్దార్. కీడెంచి మేలెంచడం మంచిదని ....

చక్ర. ఆ సంగతి నాకు తెలుసు, ఈ దుష్టసమూహం అంతా ఏక
మయి ఎదురువచ్చినా ఈ అగ్గిరాముడ్ని ఏమీ చెయ్యలేరు.

బల. మీరు జాగ్రత్తగా ఉండండి, వస్తాను.
చక్ర. భయపడకు. నాకొచ్చిన భయం ఏమీలేదు.
బల. వస్తాను .... మళ్ళీ కలుస్తాను [వెళ్ళాడు]

[లోపలినుంచి అవిత సీరియస్‌గా వచ్చింది]

అవి॥ [కోపంగా చక్రవర్తిని చూస్తుంది]
చక్ర॥ రా అవితా!
అవి, నోర్ముయ్ .... నిజంచెప్పు ... యెవరునువ్వు?
చక్ర॥ అవితా!

అవి. మాట్లాడవే .... చెప్పు .... నువ్వు అగ్గిరాముడివి గదూ!
చక్ర. అవితా!
అవి. చెప్పు, నిజంచెప్పు. నువ్వు అగ్గిరాముడివి గదూ.
చక్ర. కాదు.

అవి. అవును నువ్వు అగ్గిరాముడివే, బలరాంతో నువ్వు చెప్పిందంతా
విన్నాను.
చక్ర. విన్నావా?
అవి. అవును- యిప్పటికయినా నిజాన్ని ఒప్పుకో.
చక్ర. నిజమే, నేను అగ్గిరాముడ్ని.
అవి, యెందుకొచ్చావు?

చక్ర॥ ఆస్తికోసం, పదికోట్లరూపాయలు విలువగల వజ్రాంకోసం నీ
ప్రేమకోసం.
అవి. నోర్ముయ్. వాటిని పొందడం అతి సులభమనుకున్నావా?
చక్ర. పొందుతాను.
అవి. నీ తరంగాదు.

చక్ర. చూస్తుంటు, నీకే తెలుస్తుంది.
అని. మా బావ యెక్కడ?
చక్ర. పరలోకంలో రెస్ట్ తీసుకుంటున్నాడు.
అని. ఆ! ప.... ప... మా బావను చంపేశావా?
చక్ర. అవును.
అని. బావా! [ఏడుస్తుంది]

చక్ర. చచ్చిపోయిన వాడికోసం ఏడ్చి ఏం లాభం. బ్రతికున్నవాడ్ని నీకోసం వేసున్నాను, రా, భార్యాభర్తలమై మరో లోకంలో తేలిపోదాం [చెయ్యి పట్టుకున్నాడు]

అని. ఛీ (చెయ్యిలాక్కొని) కిరాతకుడా! మా బావ నీకేమపకారం చేశాడని. చంపావు.

చక్ర. ఆస్తికోసం తొలగించక తప్పలేదు.
అని. నిన్ను, నిన్ను, (టెలిఫోను సమీపించి టెలిఫోను రిసీవర్ఎత్తి నెంబర్ డయల్ చేసింది) హలో, పోలీస్ స్టేషన్, నేను అనితను మాట్లాడుతున్నాను. మా బావ హత్య చేయబడ్డాడు. అప్పన ది చక్రవర్తి బావే. మీరు త్వరగా రావాలి.

చక్ర. వస్తున్నాడా యిన్స్పెక్టర్.
అని. వస్తున్నాడు. నీ అంతు చూస్తాడు.
చక్ర (వికటంగా నవ్వుతాడు)
అని. నవ్వు. యింకా బిగ్గరగా నవ్వు. దుర్మార్గుడా, మా బావనుచంపిన. పాపం ఊరికే పోదు, సర్వనాశనం అవుతావు.
చక్ర. [మళ్ళీ నవ్వాడు]
అని. (ఏడుస్తూ) బావా! [సోఫాలో కూలబడింది]
[బయట్నుంచి రాజారాం వచ్చాడు]
అని. రండి ఇన్స్పెక్టర్, వీడే.. మా బావను చంపిన హంతకుడు వీడే.
రా. [నిర్ఘాంతపోయి] ఆ!

అని . వీడ్ని అరెస్టు చేయండి.

రా . చక్రవర్తిగారూ, యేమిటిది?

చక్ర. మన్నించండి యిన్స్పెక్టర్. కొద్ది రోజులుగా మా అనిత ఆరోగ్యం బాగుండడం లేదు. మతి స్థిమితంగా ఉండడం లేదు యేదో పిచ్చిపిచ్చిగా మాట్లాడుతుంది.

అని : ఆఁ, నయవంచకుడా?

చక్ర. చూశారా! ఆ చూపు చూడండి యివి పిచ్చిలక్షణాలు.

అని . ఆఁ! (కోపంతో ముందుకొచ్చింది)

చక్ర. అనితా, శాంతించు.

రా . యేదనా స్పెషలిస్టుకు చూపించకపోయారు.

చక్ర. నేనూ అదే అనుకుంటున్నాను.

అని : ఎంత నాటకమాడుతున్నావురా నయవంచకుడా. యిన్స్పెక్టర్ వాడ్ని నమ్మకండి. వీడు మా నాన్నగారు. వీడు అగ్గిరాముడు

రా . ఆఁ! అగ్గిరాముడా?

అని . అవును. బందిపోటు అగ్గిరాముడు వీడే.

చక్ర. చూశారా చూశారా ఆ ఉన్మాదం. నేను అగ్గిరాముణ్ణా?

రా . అదేమిటి అనితాదేవిగారూ! బందిపోటు దొంగ అగ్గిరాముడు ప్రస్తుతం మా కష్టడీలో ఉన్నాడు.

అని . ఆఁ!

రా . అవునండి.

అని . అబద్దం, మీరిద్దరూ ఏకమై నాటకమాడుతున్నారు. వీడుఅగ్గిరాముడే

రా . అనితాదేవిగారూ! మా దేశభక్తిని శంకిస్తున్నారు.

అని : కాదు, నిజం చెప్తున్నాను. మీరిద్దరూ ఒకటే.

చక్ర. నాగన్నా, భీమన్నా (పిలిచాడు)
(యిద్దరూ పరుగెత్తుకొచ్చారు)

నాగ : వద్దాం.
భీమ : వచ్చేశాం.
చక్ర . అవితను లోపికి లాక్కెళ్ళండి, పిచ్చిముదిరింట్టుగా వుంది.
నాగ . అమ్మో పిచ్చే
భీమ : పట్టుకోరా.
నాగ : కరుస్తుందేమోరా,
చక్ర : వూఁ. లాక్కెళ్ళండి.
నాగ : (అవిత చెయ్యి పట్టుకున్నాడు)
అవి : (నాగన్న తలమీద కొట్టింది)
నాగ : అమ్మా (చెంప పట్టుకున్నాడు)
భీమ : చచ్చువెధవా. ఆడదానిచేతిలో దెబ్బ తింటావా? నువ్వా మీసమున్న మగాడివేనా? తప్పుకో.
నాగ : (తప్పుకున్నాడు]
భీమ : (అవిత చెయ్యి పట్టుకున్నాడు)
అవి : (భీమన్న చెంపమీద కొట్టింది)
భీమ : అమ్మా [చెంప పట్టుకున్నాడు)
నాగ : బయలుదేరాడు మీసమున్న మగాడు. ఛి ఛీ
చక్ర . వూఁ. లాక్కెళ్ళండి,
నాగన్న, భీమన్న అవిత చెరొకరెక్క పట్టుకొని లోపికి లాక్కెళుతుంటారు)
అవి : ఒరేయ్ .... అగ్గిరాముడు .... నీ పాపం పండింది .... నువ్వు సుఖంగా బ్రతుకలేవు.
[అవితను లాక్కెళ్ళారు లోపికి]
లా : అమావాస్య దగ్గరికొస్తూంది గదూ. పిచ్చి ముదిరినట్టుగా వుంది.
చక్ర : సారీ ఇన్‌స్పెక్టర్. పిచ్చిలో మీకు క్రమకలిగించింది మన్నించండి
లా : పర్వాలేదు. ఏదయినా మంచి స్పెషలిస్టుకు చూపించండి.

చక్ర . అలాగే.

రా : వస్తాను (బయటికెళ్ళాడు]

చక్ర : (వికటంగా నవ్వి) పాపం, పిచ్చి అనిత! ఈ అగ్గిరాముడ్ని యెదిరించాలనుకుంటున్నావా? నీ ప్రయత్నం కొండతో ఢీకొనడం. హా ... హా ... హా ... హా ... హా...

[నాగన్న, భీమన్న లోపల్నుంచి వచ్చారు]

నాగ : హా, హా, హా, హా,

భీమ : హా, హా, హా, హా,

చక్ర : రేయ్. ఎందుకురా అలా నవ్వుతున్నారు?

నాగ : మీరు నవ్వుతున్నారని.

భీమ : అంతే.

చక్ర : అనితను యేం చేశారు?

నాగ : లోపల కట్టిపడేశాం.

చక్ర : వెరీగుడ్ .... రండి. మీతో పనివుంది. [బయటికి నడిచాడు]

నాగ : పదరా.

భీమ : పదపదరా.

(యిద్దరూ బయటికి వెళ్ళారు]

(లోపల్నుంచి అనిత చేతికున్న కట్లు విప్పదీసుకుంటూ వచ్చింది)

అని : దుర్మార్గుడా ... నీ ఆట కట్టిస్తాను.

[టెలిఫోను సమీపించి రిసీవర్ ఎత్తి నెంబర్ డయల్ చేసింది]

అని : (ఫోనులో) హలో. విజయేంద్ర ఇండస్ట్రియల్ ఎస్టేట్... నేను అనితను మాట్లాడుతున్నాను. అన్నయ్యా. నువ్వేనా. ఘోరం జరిగిపోయిందన్నయ్యా. అనుకోని ఘోరం జరిగింది. నువ్వెంటనే బయలుదేరిరా. త్వరగా రావాలి. (రిసీవర్ పెట్టేసింది]

అని : అగ్గిరాముడా .. నీ అంతుచూస్తాను. [అంటూ ఆవేశంగా అటు యిటు తిరుగుతూ ఉంటుంది)

[బయట్నుంచి రవికాంత్ వచ్చాడు]

రవి : [అవితను చూచి ] అవితా!

అవి : [ఆగి రవివంక చూసింది]

రవి : ఏమిటలా ఉన్నావ్?

అవి : ద్రోహం, వంచన, దగా, మోసం.

రవి : మోసమా? , ఏమయింది?

అవి : బావా నిజం చెప్పు. నువ్వు నన్ను ప్రేమిస్తున్నావు గదూ.

రవి : అవును.

అవి : నన్ను పెళ్ళిచేసుకోవాలని నీ మనసులో ఉందిగదూ.

రవి : అవును.

అవి : చేసుకుంటాను. నిన్నే పెళ్ళిచేసుకుంటాను.

రవి : [నిర్ఘాంతపోయి] ఆ!

అవి : అవునుబావా. మనస్ఫూర్తిగా నేను నిన్నే పెళ్ళి చేసుకుంటాను.

రవి : అవితా. నీకేమన్నా మతిపోయిందా?

అవి . లేదు.

రవి . కాకుంటే ఏమిటి నువ్వు అనేది? అన్నయ్యను ప్రేమించావు. మన సారా ఆరాధించావు. అన్నయ్యే దైవంగా నీ మనసులో నిలుపు కున్నావ్. యిప్పుడు యిలా మనసు మార్చుకుంటావా?

అవి . బావా!

రవి . నువ్వు మనసు మార్చుకున్నా నేను మార్చుకోలేదు. అన్నయ్యకు ద్రోహంచేసి కృతఘ్న ద్రోహిని కాలేను. నన్ను మన్నించు.

అవి . అన్నయ్యా, యింకెక్కడి అన్నయ్య

రవి . ఏమిటవితా, ఏమయింది?

అవి . పెదబావ చచ్చిపోయాడు.

రవి . [భయం, ఆశ్చర్య మిశ్రితమయిన స్వరంతో) ఆ! అన్నయ్య చచ్చిపోయాడా?

అవి . హత్య చేయబడ్డాడు.

రవి . అవితా, ఏమిటి మస్వనేది?

అవి , నిజం బావా! బావ అమెరికా నుండి రావడంతోనే హత్యకు గురవ్వాడు. బావ యింటికి రానేలేదు.

రవి : ఏమిటి నువ్వు మాట్లాడేది, నీ మాటలు వింటుంటే నాకు మతి పోతుంది, అవితా! యేమిటిది?

అవి : అవును బావా.

రవి . మరి, యింటికివచ్చింది అన్నయ్య కాదా?

అవి : కాదు.

రవి : యేమన్నావ్ .... అతనెవరు?

అవి : వాడే .... పెదబావ రూపంలోనున్న అగ్గిరాముడు.

రవి : అగ్గిరాముడా!

అవి : అవును

రవి : బందిపోటు దొంగా?

అవి : అవును. వాడే పెదబావను చంపి, బావలా నటిస్తున్నాడు.

రవి : యిదంతా నీ కెలా తెలుసు?

అవి : వాడి అనుచరులతో మాట్లాడటం నా చెవులారా విన్నాను.

రవి : యెంతటి నయవంచన.

అవి : బావా! వాడ్ని ప్రాణాలతో వదలగూడదు.

(బయట్నుంచి మురళీధర్, చంద్రం, ఆనంద్ వస్తారు]

ముర : యెవర్నన్నావ్?

అవి : వాడ్నే...బావగానటిస్తూ మనందరివి మోసంచేస్తున్న అగ్గిరాముడ్ని.

ముర : ఆ! అగ్గిరాముడా?

ఆనం: అగ్గిరాముడా?

చం : అగ్గిరాముడా?

అవి : అవునన్నయ్యా. పెదబావను హత్యచేసి ఆస్థికోసం తను మా బావగా యీ యింట్లో ప్రవేశించాడు.

అవి. అన్నయ్యా! (కౌగిలించుకుని ఏడుస్తుంది)

ముర. ఏడవకమ్మా ... నీ బాధ గ్రహించాను, కాని మనకిక లేదు. గతించిన దానికి విచారించి ప్రయోజనం. జరగాల్సిన దాన్ని గురించి ఆలోచించాలి.

అవి. అదే, ఆ కసాయివాడి ప్రాణం తీయడమే జరగాలి. వాడు గిలగిలా తన్నుకోవడం నా కళ్ళారా చూడాలి.

ముర. అందుకే దీన్ని తెచ్చాను [సీసా చూపిస్తాడు]

అవి. యేమిటది?

ముర. విషం.

అవి. (బాటిల్ తీసుకుంది)

ముర. యెలాగయినా యీ విషాన్ని వాడిచేత నువ్వే త్రాగించాలి,

అవి. త్రాగిస్తాను. వాడి ప్రాణం తీస్తాను.

ముర. జాగ్రత్తసుమా!

అవి. నా ప్రాణంపోయినా సరే వాడిప్రాణంతీయడమే నాకుకావాలి

ముర. మేము బయటే ఉంటాము

అవి. సరే,

(మురళీబయటికివెళ్లాక అవిత బాటిల్‌వంక క్రూరంగాచూస్తుంది)

అవి. బావా! నిన్ను చంపిన ఆ దుర్మార్గుణ్ణి నీ దగ్గరకే పంప బోతున్నాను. (సీసా జాకెట్‌లో దాచిపెడుతుంది)

(కొన్నిక్షణాల అనంతరం బయటినుంచి చక్రవర్తి ప్రవేశించాడు)

చక్ర. ఓ .... కుమారి అవితాదేవిగారా! ఏమిటలా ఉన్నారు? బహుశా స్వర్గవాసి మీ బావగారు గుర్తుకు వచ్చారా?

అవి. అవును,

చక్ర. చూడు అవితా! ధర్మదేవత ప్రస్తుతం నా పక్షాన ఉండి నేను అనుకున్నది జరుగుతుంది. చనిపోయిన మీ బావకోసం తాప త్రయపడటం అనవసరం. బ్రతికున్న నన్ను వరించి నీ జీవితాన్ని సార్థకం చేసుకో.

అని, నేనూ అదే ఆలోచిస్తున్నాను.

చక్ర. యేమని?

అని. ధర్మం నీ పక్షాన వుంది. ఆస్తియావత్తు నీపరం కాబోతుంది, కోటి కోటి లాంటి ఆస్తి నీ ఒక్కడికే సంక్రమించటం నా కిష్టంలేదు.

చక్ర, అందుకని?

అని. అందుకని....

చక్ర. ఏం చెయ్యాలనుకుంటున్నావు?

అని, చిన్నపెళ్ళాంది యావదాస్తికి అధికారిణి కావాలనుకుంటున్నాను

చక్ర, అందుకు నా అభ్యంతరం లేదు

అని: ఆస్తి నీ హస్తగతం కాగానే సగం నా పేర వ్రాయాలి.

చక్ర. వ్రాస్తాను.

అని. అలాగయితే చిన్న పెళ్ళి చేసుకుంటాను.

చక్ర. కలుపు చెయ్యి.

అని: (చెయ్యి కలిపింది)

చక్ర. [చెయ్యి పట్టుకొని దగ్గరగా లాక్కున్నాడు]

అని: రామూ,

చక్ర: అనితా

[అనిత ఉత్సాహంగా పాటపాడుతుంది. చక్రవర్తిగూడా పాడ్తాడు]

(పాట - 8) [అనిత, చక్రవర్తి డ్యూయెట్]

(పాట పూర్తయింది. అనిత చక్రవర్తి చేతులలో ఇమిడిపోయింది)

అని: (తప్పించుకొని) వస్తాను.

చక్ర: యెక్కడికి?

అని: కాఫీ తెస్తాను.

చక్ర: త్వరగా రావాలి.

అని: ఒక్కక్షణం (లోపలికెళ్ళింది)

చక్రవర్తి సోఫాలో వార్గాని సిగరెట్ ముట్టించాడు లోపలనుంచి అనిత కాఫీకప్పుతో వచ్చింది)

అని : కాఫీ (అంటూ చక్రవర్తికిచ్చింది)

(కప్పులో కాఫీ సాసర్లో సగంపోసాడు చక్రవర్తి)

చక్ర : పిప్టీ పిప్టీ (యివ్వబోయాడు)

అని : [ఉలిక్కిపడి) ఉహూఁ ... నాకొద్దు.

చక్ర : అలా వీల్లేదు. అమృతమైనా విషమైనా చెరిసగం త్రాగినపుడే మన ప్రేమకు పరమార్థం వూఁ తీసుకో.

అని : నాకొద్దు. నేనింతకు ముందే త్రాగాను.

చక్ర : పర్వాలేదు. నాచేతితో త్రాగిస్తాను.

అని : ఒద్దు రామూ, నేను త్రాగను,

చక్ర : అయితే నాకూ వద్దు. [కప్పు సాసర్ టేబిల్ మీదుంచి లోనికెళ్లాడు]

అని : (వాకిలివంక చూస్తూ) తాగుతాను రామూ: మాటాన పోయిన తర్వాత నేనున్నా లేకున్నా ఒకటే త్రాగుతాను. నేను చచ్చిపోయినా పర్వాలేదు. కాని– నువ్వు బ్రతికుండడానికి వీల్లేదు.

(లోపలనుంచి చక్రవర్తి వచ్చాడు)

అని : రామూ.

చక్ర : వూఁ.

అని : (టేబుల్ మీదున్న సాసర్ తెచ్చి చక్రవర్తికిస్తూ] వూఁ.. తీసుకో.

చక్ర : మరి నువ్వో ....

అని : తీసుకుంటాను. (సాసర్ చక్రవర్తికిచ్చింది)

చక్ర : (సాసర్లోని కాఫీ త్రాగి సాసర్ క్రింద పెట్టాడు)

అని : [కప్పు చేతిలోనికి తీసుకుంది]

చక్ర : వూఁ .... త్రాగు.

అని : త్రాగను. అగ్గిరాముడూ, (సీరియస్‌గా మారి) త్రాగను (కప్పులోని

కాఫీ (క్రిందపోసింది) అగ్గిగామునూ, మనిష్య్రాగిరేటలో శెలపా

చక్ర . కాఫీ.

అవి . కాదు. కాఫీలో మిళితమైన కాలకూట విషం.

చక్ర . ఆఁ.

అవి . అవును, దుర్మార్గుడా! మా నాన్నను చంపిన మనిష్వి బ్రతకకూడదు.

(చక్రవర్తి గుండెల్లో బాధతో మెలితిరుగుతుంటాడు)

చక్ర . అమ్మా! [బాధపడతాడు]

అవి . ఏం? మా నాన్నకూడా యిలాగే బాధపడి మరణించాడు కదూ?

చక్ర . అమ్మా ... నిన్ను పెంచకి ... నమ్మించి మోసంతో నన్ను చంపా లనుకుంటావా, విను బ్రతుకనివ్వను. (అవితను పట్టుకోబోయాడు)

అవి . [దూరంగా వెళ్ళింది]

చక్ర . [నిలబడలేక పడిపోయి బాధపడుతుంటాడు]

అవి . (అతనివంక చూస్తుంటుంది)

చక్ర . [క్రిందపడి బాధతో పొర్లాడుతూ] అమ్మా .... అమ్మా .... ఆ..
(ప్రాణం విడిచాడు)

అవి . పీడా విరగడయింది.

[బయటనుంచి మురళి, చంద్రం, రవికాంత్, ఆనంద్ వచ్చారు)

రవి . ఆఁ! (భయంగా] చంపేశావా అనితా?

అవి . చచ్చిపోయాడు.

రవి . వెరీగుడ్, ఆ శవాన్ని పట్టండి, రహస్యంగా కారులో తీసుకెళ్ళి ఊబిలో పారవేద్దాం.

ఆనం. అవును.

చం . పట్టండి,
[మురళి, చంద్రం, ఆనంద్ చక్రవర్తి శవాన్ని బయటికి మోసు కుని వెనుకగా రవిగూడా వెళ్ళాడు]

అవి . (విరగబడి నవ్వుతుంది)
[ఆ నవ్వు విషాదంగా మారి యేడుస్తుంది]

అవి . నాన్నా! (అంటూ ఏడుస్తూ సోఫాలో కూలబడింది)

# ఐదవ రంగం

(అది విజయేంద్రభూపతిగారి భవనంలో హాలుగది, అలంకరణంతా మొదటిరంగం మాదిరిగానే ఉంటుంది. మార్పేమీ ఉండదు)

(తెర లేచింది)

[అనిత సోఫా కానుకొని క్రిందకూర్చొని ఏడుస్తూ వుంటుంది. ఏడుస్తూ తన బావ చక్రవర్తిని తల్చుకుంటూ పాట పాడుతుంది]

(పాట - 10) (అనిత సాడ్ సాంగ్)

(పాట పూర్తయింది బయటనుంచి బలరాం వచ్చాడు]

బల, చక్రవర్తి .... ఒరేయ్ చక్రవర్తి [పిల్చాడు]

అని. వచ్చావా ... రా ... [illegible] ... మీ కపటనాటకం బట్ట బయలైంది. అందుకే వాడ్ని నీ అనుచరుడ్ని...ఆ అగ్గిరాముడ్ని కామరూపాలు లేకుండా చేశాను.

బల. ఏమన్నావ్? అగ్గిరాముడ్ని కామరూపాల్లేకుండా చేశావా?

అని: అవును, [బయటనుంచి రాజారాం వచ్చాడు]

బల, ఏం చేశావు అతన్ని?

అని. కాలకూట విషాన్ని త్రాగించి వాడి ప్రాణం తీశాను.

బల<br>రాజా : అఁ! [నిర్ఘాంతపోయారు]

అని: అవును ఆ దయా దాక్షిణ్యాలులేని కఠిన పాషాణహృదయుడు మా బావను హత్యచేశాడు. అందుకు ప్రతీకారంగా విషమిచ్చి ప్రాణం తీశాను.

రాజా: అవితా! యెంతపని చేశావ్.

అవి: కావాలనే చేశాను ఇన్‌స్పెక్టర్. ప్రభుత్వం నన్ను శిక్షిస్తుందని తెలుసు ఉరికంబం ఎక్కిస్తుందని తెలుసు నా ప్రాణం తీస్తుందనికూడా తెలుసు. అయినా మా బావలేని ఒంటరి జీవితం నాకు నిష్ప్రయోజనం. అందుకేనేనూ మా బావదగ్గరకే వెళ్లాలనుకున్నాను.

బల : అవితా.

అవి: అవును. వెళ్తూ పగ సాధించాలనుకున్నాను... సాధించాను. అగ్గిరాముడ్ని అంతంచేశాను. ఇన్‌స్పెక్టర్ రండి...నన్ను అరెస్టుచేయండి

రా : ఎంతపని చేశావు అవితా.

బల : చివరికి నీ వ్రేలితో నీకన్నే పొడుచుకున్నావు.

అవి : యేమన్నావు?

బల : తొందరపాటుతో నీ భవిష్యత్తునే సర్వనాశనం చేసుకున్నావు.

అవి : కాదు. నా పగ చల్లార్చుకున్నాను.

రా : యెలా?

అవి : మా బావను చంపిన అగ్గిరాముడ్ని అంతంచేసి.

బల : కాదు, నువ్వు విషమిచ్చి చంపింది అగ్గిరాముడ్ని గాదు

అవి : మరెవర్ని?

రా : మీ బావన్నే.

అవి : ఆఁ మా బావనా? ఏమిటి మీరంటున్నది?

బల : అవునమ్మా. అగ్గిరాముడిలా నటిస్తున్నది ఎవరోగాదు. మీ బావ చక్రవర్తి.

అవి : ఆఁ! బలరాం నువ్వు .. నువ్వుగూడా నాటకమాడి నన్ను నమ్మించాలనుకుంటున్నావా? నువ్వు అగ్గిరాముడి తొత్తువి.

రాజా: అవితా, ఏమిటా మాటలు?

అవి . అవును ఇన్‌స్పెక్టర్. ఈ బలరాం అగ్గిరాముడి అనుచరుడు.

రాజా: కాదు ఇతను సి. ఐ. డి. ఇన్‌స్పెక్టర్ బలరాం,

అని : ఆ :

రాజా: అవును అనితా. కొందరు దుండగులు దొంగనోట్లు ముద్రించి చెలామణి చేస్తున్నారని తెలిసి, ప్రభుత్వం వీరిని పరిశోధనకు నియమించింది.

బల . వజ్రాన్ని వజ్రంతోనే కోయాలి. దొంగను దొంగగానే పట్టుకోవాలి అందుకనే దొంగగా, హంతకుడిగా వేషం మార్చి కార్యరంగంలోకి దూకాను.

రాజా. ఇంతలో మీ మామయ్య హత్య చేయబడ్డాడు. మీ బావ అమెరికా నుండి వచ్చారు.

బల . ఆయనకెటువంటి ప్రమాదం జరగకుండా అగ్గిరాముడిగా మార్చి పరిశోధన కోసం నాటకమాడాం. ఇంతలో నువ్వు మీ బావే అగ్గిరాముడని తెలియక ప్రాణం తీశావు.

అని : ఆ! బావా [ఏడుస్తూ] నేను చంపింది మా బావనా? ఇన్‌స్పెక్టర్ ఇది నిజమా? నేనెంత పాపిష్టిదాన్ని. చేజేతులా బావను చంపాను. మా బావను చంపాను. (ఏడుస్తుంది]

రాజా. నువ్వింతటి సాహసానికి పూనుకుంటావనుకోలేదు అనితా.

అని . బావా. [ఏడుస్తుంది] ఎవరికోసం ఆరుసంవత్సరాలుగా కలలు గంటూ బ్రతికానో, ఎవరికోసం క్షణమొకయుగంగా గడిపానో ఎవరికోసం నా జీవితం అంకితమనుకున్నానో ఆ బావనే ఈ చేతులతో విషమిచ్చి చంపాను, బావా [ఏడుస్తుంది]

బల . ఇన్‌స్పెక్టర్.

రాజా. యస్ సార్.

బల , మన ప్లానంతా తారుమారయింది.

రాజా. అవును సార్.

బల. చక్రవర్తిని కావాలని యిన్ని ప్రయత్నాలు చేసిగూడా కాపాడలేక పోయాం. ఇది మన డిపార్ట్‌మెంట్‌కే తీరని అవమానం.

రాజా. అది మన దురదృష్టం సార్.

అని. కాదు, దురదృష్టవంతురాలిని నేను. అందిన అదృష్టాన్ని కాల ద్రోసుకున్న నిర్భాగ్యురాలిని నేను [ఏడుస్తుంది)
బయట్నుంచి కానిస్టేబుల్ యూనిఫాంలోమన్న నాగన్న భీమన్న వచ్చారు]

నాగ. సార్ సార్.

రాజా. యేమిటోయ్?

భీమ. రహస్యం సార్.

బల. యేమిటది?

నాగ. చెవిలో రహస్యం సార్. [అంటూ బలరాం చెవిలో ఏదో చెప్పాడు)

భీమ. (రాజారాం చెవిలో చెప్పాడు]

బల
రాజా : [ఇద్దరూ ఒక్కసారిగా] ఆ! నిజంగానా?

భీమ
నాగ . (ఒక్కసారిగా] అవునుసార్

బల. కమాన్ [అంటూ గబగబా బయటికి నడిచాడు]

[నాగన్న, భీమన్న, రాజారాం అతన్ని అనుసరించాడు)

అని. బాగా ఏడుస్తూ కూలబడింది)

[బయటనుంచి మురళీధర్, ఆనంద్, చంద్రశేఖర్ వస్తారు]

అని. అన్నయ్యా ... ఘోరం జరిగిందన్నయ్యా...

ము. ఏమిటమ్మా?

అని. నేను విషమిచ్చి చంపిన అగ్గిరాముడు మరెవరోగాదు అన్నయ్యా. పెదబావ చక్రవర్తే.

ము. నేను కాదన్నానా?

అని. అంటే? పెదబావే అగ్గిరాముడని నీకు తెలుసా?

ము. తెలుసు.

అని. ఆ! .... తెలుసా?

ము. అంతేగాదు చెల్లెమ్మా. సి. ఐ. డి. ఇన్‌స్పెక్టర్ బలరాం, ఇన్‌స్పెక్టర్ రాజారాం కలిసి ఈ నాటకం ఆడించారని ముందే తెలుసు. వారిఎత్తులు చిత్తుచేయడానికి, ఆస్తికి సర్వాధికారి కావడానికి నీచేత చంపించాను.

అని. దుర్మార్గుడా.

ము. అనాల్సి వచ్చాలేదు.

అని. నువ్వూ ఒక మనిషివా... ఏ పాపమెరుగని పెదబావను నాచేత చంపించావు.

ము. నువ్వు చంపుతానన్నావు. నేను విషం తెచ్చిచ్చాను అంతే.

అని. ఛీ. నువ్వు స్వామిద్రోహివి. తిన్నయింటి వాసాలు లెక్కించే స్వామిద్రోహివి.

ము. అన్నం తిన్న కంచానికి కన్నం వేయడం నా అలవాటు కాకుంటే ఆస్తి మొత్తా దక్కించుకుంట చెల్లెమ్మా.

అవి. ఆస్తికోసం యింతటి కిరాతకానికి పాల్పడతావా?

ము. చేసింది చేసి నేరం నామీద వేస్తావా?

అవి. బావా (ఏడుస్తూ] నన్ను క్షమించవా! క్షమించు.

ఆ, అది కాదేవి. నిన్ను క్షమించడానికి మీ బావ బ్రతికి లేడు..

చం. బ్రతికి రాలేడు.

ము. రాలేడు.

(ముగ్గురు వికటంగా నవ్వుతారు, అవిత బిగ్గరగా ఏడుస్తుంది)

ము. హైడియర్ ఫ్రెండ్ .... మనకున్న అడ్డుకాస్తా తొలిగిపోయింది. ఇక ఈ యావదాస్తి మనదే. హ.... హ.... హ.... హ....

ఆ. హ.... హ... హ.... హ....

చం. హా.. హ.. హ.. హ..

అవి. బావా [ఏడుస్తూ లోనికి పరుగెత్తింది)

ము. మైడియర్ ఫ్రెండ్స్. ఈ ఆనంద సమయంలో ఘనంగా విందు చేసుకోవాలి. ఏమంటారు?

చం. యా,

ము. బాటిల్స్.

(చంద్రం, ఆనంద్ తమ పాకెట్లలోని బ్రాంది బాటిల్స్ బయటకు తీసారు]

[వాటిని అందుకొని మురళీధర్ గ్లాసులను నింపాడు]

తలా ఒక గ్లాసు అందుకొని త్రాగబోయారు. ఇంతలో బయ ట్నుంచి రవికాంత్ ప్రవేశించాడు. అందరివంకా ఆశ్చర్యంగా చూశాడు. బ్రాంది త్రాగబోయిన ముగ్గురు అతన్నిచూసి ఆగారు. కొన్ని నిముషాలు మౌనంగా ఒకర్నొకరు స్థబ్దుగామారి చూసు కున్నారు. ఆ కాలమంతా మ్యూజిక్‌తో గడిచింది)

[లోపల్నుంచి అనిత వచ్చింది)

అని . బావా.. రవిబావా,
రవి . ఏమిటి అనితా!
అని . నేను చంపింది ఎవర్నో తెలుసా?
రవి : తెలుసు., అగ్గిరాముడ్ని.

అని : కాదు, కాదు, నేను చంపింది మీ అన్నయ్యను.
రవి : [నిర్ఘాంతపోయి] అనితా ఏమన్నావ్- నువ్వు విషమిచ్చి చంపింది మా అన్నయ్యనా?
అని : అవును బావా.
రవి : ఎంత పొరపాటు జరిగింది.

అని . బావా! నేను తెలిసి తెలిసి ఈ పాపాన్ని చేయలేదు. తెలిస్తే నా ప్రాణసమానంగా ప్రేమించినబావను చంపుకుంటానా? (ఏడుస్తుంది [రవి బాధగా మౌనంగా బ్రాందీతో నిండివున్న గాజుగ్లాసు తీసుకున్నాడు)

రవి : ముశేఖర్! ఇంతటి ఘోరాన్ని అనిత చేస్తుందని నేననుకోలేదు మా అన్నయ్యను, నా ప్రాణంతో సమానంగా ప్రేమించిన మా అన్నయ్యను. నాకోసం, నా క్షేమం కోసం అహర్నిశలు శ్రమించిన ఆ పుణ్యాత్ముని ఈ అనిత... ఈ నయవంచకి.. ఈ మానవరూప కాలసర్పం విషమిచ్చి ప్రాణం తీసింది.

అవి : (బాధగా) బావా!

రవి : నిష్కళంక ప్రేమమూర్తి, అనురాగమూర్తి అయిన మా అన్నయ్య మమ్మల్ని వదిలి వెళ్ళిపోయాడు. ఈ ఆనంద సమయంలో మనం జల్సా చేసుకుందాం.

ము : హిప్ హిప్

అదం : హుర్రే

ము : హిప్ హిప్

అదం : హుర్రే.

ము : హిప్ హిప్

అదం : హుర్రే

అవి : బావా,

రవి : (నవ్వి) విచారించకు చిట్టి మరదలా. ఆస్తికోసం అన్నయ్యను చంపాలని ప్లాను వేసింది నేను. నాకు తోడుగా ఈ ముగ్గురు నిల్చి [illegible]. అదే మా అన్నయ్యను నీ చేత చంపించాను అంతే.

ము : బావా!

రవి : ఏమిటి బావా!

ము : హూఁ కానివ్వు.

అందరూ గ్లాసులు "ఛీర్స్" అంటూ ఎత్తిపట్టి నోటికందించారు.

క్షణంలో నాలుగుగ్లాసులు ఖాళీ అయ్యాయి)

శం . ఆటాపాటా లేని పార్టీ మజాగా లేదు.

ఆ . మనువుతో పాటు మగువ కూడా అవసరం.

రవి . అనితా, విన్నావా మా మిత్రుల కోరిక. ఆడు, పాడు.

అని : నోర్మూయ్.

రవి : (అనిత చెంపమీద కొట్టాడు)

అని . [సోఫాలో పడింది)

రవి . (నవ్వి) అనితా, చెప్పింది చెయ్యకపోతే మీ మామయ్యను పంపిన చోటుకే పంపుతాను.

అని : ఆఁ.

రవి : అవును డియర్. ఒక ప్రాణం తీసినవాడికి మరో ప్రాణం తీయ డానికి జంకను.

అని : మీ నాన్నను చంపింది నువ్వా?

రవి . అవును,

అని . దుర్మార్గుడా. కన్నతండ్రిని చంపడానికి నీ చేతులెలా వచ్చాయి?

రవి . కన్నతండ్రి (నవ్వి] ఎవరు కన్నతండ్రి? విజయేంద్ర భూపతి నా కన్నతండ్రా? నో. మురళీధర్. వాడు నా కన్నతండ్రా?

ము . నో

శం . నో, నో,

ఆ నో. నో, నో

రవి . అసలు భూపతిని ఎందుకు చంపానో తెలుసా? మొట్టమొదటిసారిగా వీలునామాలో ఆస్తియావత్తు తనకొడుకు చక్రవర్తి పేర వ్రాశాడు. నమ్మకంగా నటించి ఆ వీలునామాను రద్దు జరిపించాను రెండవ సారి వీలునామాలో మా యిద్దరికీ చెరిసగం ఆస్తి వ్రాయమని లాయర్ చంద్రశేఖరంతో అన్నాడు.

చం : రవిబాబు క్షేమంకోరం ఆస్తి మొత్తం రవిబాబు పేర వ్రాసాము.

ఆ . వాడు పూర్తిగా శ్రద్ధగా చదువుతుండగానే నీ దగ్గర కళ్ళతో సంతకం పెట్టాడు.

రవి . ఆ వీలునామా మారగూడదని తక్షణం ఆస్తి నా పరం కావాలని ముసిలాణ్ణి చంపాను.

అవి . ద్రోహి

రవి . అంతేగాదు. చక్రవర్తి వస్తున్న విమానాన్ని కూల్చివేయమని కొందరు అనుచరుల్ని నియమించాను. యిన్స్పెక్టర్ ఆ ప్రమాదాన్ని తప్పించాడు.

చం . అందుకే నీచేత విషమిచ్చి చంపించాం.

అవి . అయితే నావే అగ్గిరాముడని మీ అందరికీ తెలుసన్నమాట

రవి . (నవ్వి) తెలుసు అవితా, నాఆనందం కోసం నువు సంతోషంగా పాడు

అవి , ఆడను... పాడను.

రవి . ఆడు

అవి . ఆడను

రవి . పాడు

అవి . పాడను.

రవి . (బెల్టుతీసి అవితను కొట్టాడు]

అవి . బావా!

రవి . ఊం. ఆడు, పాడు.

(అవిత డాన్సుచేస్తూ పాట పాడుతుంది. నలుగురు బ్రాందీ సేవిస్తుంటారు)

[పాట - 11]   [అవిత డాన్సుసాంగ్]

[పాట పూర్తయింది. అవిత ఆడలేక పడిపోతుంది)

అవి . బావా! [బిగ్గరగా అరిచి పడిపోయింది)

చక్ర . [వస్తూనాకిటికీవద్దఆగి]వచ్చావుఅవితా [అతనిచేతిలో పిస్టల్ వుంది]

రవి . ఆ!, అన్నయ్యా.

ము ! బావా!

చం . చక్రవర్తి

ఆనం. ఆఁ.... చక్రవర్తి.

అవి . బావా [అంటూ పరుగెత్తుకెళ్ళి కౌగలించుకుంది)

రవి . నువ్వు బ్రతికే ఉన్నావా?
చక్ర నీ ఆట కట్టించనిదే మరణిస్తాననుకున్నావా?
ము . హూఁ వాడ్ని పట్టుకోండి.

(చంద్రం ఆనంద్ ముందుకు రాబోయారు]
చక్ర . ఆగండి! అడుగు ముందుకేసారా? మీ గుండెలు చీలుస్తాను జాగ్రత్త.
ము . చక్రవర్తీ!

చక్ర . నో య్మేన్. తిన్నయింటి వాసాలు లెక్కపెట్టే స్వామిద్రోహులు!
[బయటునుంచి రాజారాం, బలరాం, నాగన్న, భీమన్న. వచ్చారు. రాజారాం, బలరాం చేతులలో పిస్టల్స్ ఉన్నాయి]

బల . హూఁ... ముఠా అంతా యిక్కడే ఉందన్నమాట.

రాజా. కానిస్టేబుల్స్.

నాగ
భీమ . యస్ సార్.

రాజా. హూఁ. బేడీలు వేయండి.

[నాగన్న, భీమన్న నలుగురు చేతులకు బేడీలు వేసారు]
రాజా. హూఁ. పదండి.
(నాగన్న భీమన్న నలుగురినీ బయటికి లాక్కెళ్ళారు. వెనకగా రాజారాం వెళ్ళాడు]

బల . మిష్టర్ చక్రవర్తి! విషానికి ముందే విరుగుడు మంత్రాగి మీ

ప్రాణాన్ని రక్షించుకున్నారు. మా డిపార్టుమెంట్ కు అపకీర్తి రాకుండా కాపాడారు.

చక్ర. ఇటువంటి సంఘటన జరుగుతుందని అనుమానం వచ్చే నా జాగ్రత్తలో నేనున్నాను.

ఇం. ఏది ఏమయినా మీ సహాయ సహకారాలవల్ల నేను ముగిసి నేరస్తులు పట్టుబడ్డారు.

చక్ర. ధర్మానికే అంతిమ విజయం.

ఇం. వస్తాను [వెళ్ళాడు]

చక్ర. అనితా!

అని. (ఏడుస్తూ) బావా నిజం తెలియక నీకు విషమిచ్చాను. నా తప్పు క్షమించు బావా. (కాళ్ళమీద పడింది)

చక్ర. తెలియక చేసిన తప్పు తప్పుకాదు. లే అనితా [భుజాలు పట్టుకొని లేవదీసాడు]

అని. బావా!

చక్ర. అనితా (అంటూ హృదయానికి హత్తుకున్నాడు)

[అనిత ఉత్సాహంగా పాట పాడుతుంది. చక్రవర్తి ఆమెను అనుసరిస్తాడు]

[పాట - 12] [అనిత, చక్రవర్తి డ్యూయెట్]

[పాట పూర్తయింది. అనిత చక్రవర్తి ఒడిలో చేరి అలా అల్లుకుపోయింది)

[తెర జారుతుంది]

ఐదవరంగం - సమాప్తం

ది. 25-5-76 వ తేదీన మొట్టమొదట ప్రదర్శించిన
శ్రీ నవోదయా యూనిట్, రాచెలవారు

నటవర్గం :

కరుణాకరం : శ్రీ టి వి రెడ్డి
సాధు : " ఇ. భరతా రెడ్డి బియస్‌సి. బియిడి
మదన్ : " ఆర్. పారనాధ్, బియస్‌సి.
సత్యం : " యం. సుధాకర రెడ్డి
రమణ : పి. వి. యస్ రామకృష్ణ (డ్రాయింగ్ టీచర్)
మహర్షి ; " యం. సాంబయ్య
కైలాసం : " ఆర్. పులారావు
డాక్టరు ; " బిరమోహనా రెడ్డి
గీత : " శ్రీమతి శైలజ [తెనాలి]

సాంకేతిక నిపుణులు ;
దర్శకత్వం ; నవోదయా యూనిట్
సంగీతం ; వెంకటేశ్వరా మ్యూజికల్ యూనిట్ (తెనాలి)
సెట్టింగ్స్ ; కె. కె. రావు
నిర్వహణ ; శ్రీ టి. వి. రెడ్డి

## మీ ముందు నిలిచే పాత్రలు

కరుణాకరం — [న్యాయవాది] వయస్సు 45 సం.

మధు - (న్యాయవాది కొడుకు) " 20

మదన్ - (కసితో చెరసాలని వెలుగును చూసినవాడు) " 16

సత్యం — (విప్లవజ్వాలగా రగిలి చీకటిగా మిగిలినవాడు) " 25

రమణ — (మహానటుడు కావాలని ఊళ్లల్లో తిరిగినవాడు) " 25

మహర్షి — (అభ్యుదయ భావాలు ఇతని ఆభరణాలు) " 26

రత్నాలు - (న్యాయవాది ఇంట్లో దీపం) " 25

డాక్టర్ - (సత్యం తెలిసినవాడు) " 40

గీత - (సత్యానికి చెల్లెలు కావటంతో అభాగిని అయింది) " 18

శ్రీ నవజ్యోతి నాట్యకళామండలి, వంగుపాలెం పొన్నూరు

నటవర్గం :

కరుణాకరం - శ్రీ వై. పున్నరాజు

మధు - శ్రీ బసవప్రసాద్

మదన్ - శ్రీ పి. భాస్కరరావు [టీచర్]

సత్యం - శ్రీ సిహెచ్. శ్రీనివాస్

రమణ - శ్రీ సిహెచ్. మాణిక్యరావు

మహర్షి - శ్రీ సిహెచ్. నాగేశ్వరరావు [బి కాం]

రత్నాలు - శ్రీ యం. వీసురత్నం

డాక్టర్ - శ్రీ యం ఎల్లమంద

గీత - కుమారి జి. విజయ (తెనాలి)

సాంకేతిక నిపుణులు -

దర్శకత్వం - శ్రీ సిహెచ్ శ్రీనివాస్

నిర్వహణ - శ్రీ సిహెచ్ మాణిక్యరావు

ఆర్గనైజర్ - శ్రీ సిహెచ్ ప్రేమయ్య

పర్యవేక్షణ - శ్రీ పి భాస్కరరావు

మ్యూజిక్ - శ్రీ సైదారావు అండ్ కృష్ణ పార్టీ (పొన్నూరు

సెట్టింగ్స్ అండ్ మేకప్ - శ్రీ కె కె రావు (గుంటూరు)

# శీలానికి శిక్ష

## మొదటి రంగం

[అది పెంకుటిల్లు, ముందుహాల్లో గోడలకు దేశనాయకులఫోటోలు, విశ్వకవుల కాలెండర్లు, ప్రకృతిచిత్రాలు తగిలించారు. రెండు కుర్చీలు, ఒక డ్రాయరు, పాతటీపాయ్ ఆ ఇంటి అలంకరణలు. తెర తొలగేసరికి గీతా, మధూలు వీపులు ఆనించుకుని మౌనంగా కూర్చునివున్నారు. మౌనం పెదాలపై చిరునవ్వులా విరిసింది. ఆ చిరునవ్వులు దిక్కులు పిక్కటిల్లేలా చేశాయి. కళ్ళలో మెరిసే ఆనందాన్ని, పెదవులపై వూరే కోరికల్ని తృప్తిగా తుడుచు కున్నారు గతంమంది తేరుకుంటూ]

**మధు :** మాట్లాడు.

**గీత :** నిన్నుచూస్తుంటే మాటలే రావడంలేదు.

**మధు:** మూగదానివై పోతావ్ సుమా!

**గీత :** (కిలుక్కున నవ్వి అతని బుగ్గమీద వ్రేలితో పొడిచింది. అతనూ నవ్వాడు ఇద్దరూ కలిసి ఆనందంగా పాడుకున్నారు)

**మధు:** నాకో బహుమానం ఇస్తావా?

**గీత :** మనసే ఇచ్చానుగా.

**మధు:** అంతకన్నా మధురమయింది కావాలి.

గీత : నువ్వడిగితే ఏది కాదనాన్నను?

మధు. అయితే ఇంకేం? ఒక తీయనిముద్దు పారేయి మరి - (అ ప్రయత్నం చేశాడు)

గీత : ఆగండాగండి- ఇంత ఆత్రం మంచిదికాదు.

మధు: అందాలుపూరించడం - అందకుండా పారిపోవడం- మీ ఆడవాళ్ళకు అలవాటేలే.

గీత : అందిన అందాలను వాడినమందారాలుగా చేయడం మీ మగవాళ్ళకు మాత్రం అలవాటు కాదా ఏమిటి?

మధు: పూలు విరియగనే సరికాదుగీతా! వాటిపరిమళం బయటపడాలంటే జడలోనో- ముడిలోనో చేరాలి.

గీత : పాపం—ఎంతాశ (సిగ్గుతో తలొంచింది)

మధు: ఆశ మానవుడిసొత్తు గీతా, హక్కుకూడా.

గీత : ఇంకా నయం. ఆస్తి అనలేదు.

మధు: అవునుగీతా: ఆస్తికూడా అందుకే మనిషి ఆశను నమ్ముకుంటారే గాని హృదయాన్ని అమ్ముకోడు గీతా, పరువానికి పరవశానికి పగ్గంకావాలి. వూహలకూ, వూపిరికీ పూరటకావాలి, అందుకే... అందుకే.... నన్ను నీలోకి చేర్చుకోగీతా!

గీత : మధూ! (ఆనందంతో నోరు నొక్కేసింది)

మధు: నిజంగీతా! జీవితంలో సుఖానికి నన్నొకక్షణ్ణే వారసుణ్ణిచేశావు! కమ్మని కౌగలింతల పులకింతలలో నన్ను నేను మరచిపోయేంత మధురమయిన మత్తు కలిగించావు.

గీత : లేదు మధూ: మత్తయిన కోరికల్ని, మెత్తనిఆశల్ని నువ్వే కలిగించావు.

మధు: అవును గీతా! ఏ దూరతీరాలలోనో అనురాగం పెంచుకుందామని,
ఆనందం పంచుకుందామని. తీయని కలలు గన్నాం. మన కలలన్నీ
తీపి గురుతులుగా తొలకరి మెరుపులుగా మిగిలిపోగూడదని ఏ
దేవుణ్నయినా కోరుకుందాం గీతా!

గీత : మధూ! (తన్మయత్వంతో సకమతం చేసింది)

మధు: చదువుల పరిచయం హృదయాలను కలిపింది. కళలూ కవితలూ
మన స్నేహానికి ఊపిరిపోశాయి గీతా! ఈ చదువూ సంస్కృతి
ఇలాగే వుండాలని ఈ బంధం జన్మజన్మల అనుబంధం కావాలని
నేననుకుంటున్నాను. మరి నువ్వేమంటావు?

గీత : తిరిగి జన్మంటూ వుంటే నీవిడనే ఇంతచోటు ప్రసాదించమని
దేవుడ్ని వేడుకుంటాను మధూ

మధు: మరి నేనడిగింది? (ముద్దు కావాలని సైగ చేశాడు)

గీత : ముందు నాకో మాటివ్వాలి?

మధు: వెంటనే ఆ మూడుముళ్ళు వేసి...

గీత : ఏనోష్ఠతల్లివిచేస్తావు... అంతేగా?

మధు : అంతకన్నా ఆడదానికి కావలసింది మాత్రం ఏముంది గీతా!
"అమ్మా" అనిపించుకునే అపురూపవరం భగవంతుడుమీకుప్రత్యే
కంగా ప్రసాదించాడు.

గీత : మీ మగవాళ్ళు యెప్పుడూ ఇంతేలే ఆడవాళ్ళను ముసలివాళ్ళను
చేయాలనే చూస్తారు

మధు: అదేమిటి గీతా! పిల్లల్ని కనడం – వాళ్ళచిరునవ్వుల దివ్వెలువెలి
గించడం ఇష్టంలేదా నీకు?

గీత : పిచ్చిమధూ! కలలుగంటే, కరగిపోతాయి చెరిగిపోతాయి కూడా

మధు: చూడుగీతా! బ్రతుకుచుట్టూ నీవలపుతీగలే అల్లుకుపోతాయి. గుండెల
నిండా కన్నులనిండా నీ మమతలమల్లెలే విరిశాయి. నీ అడుగులో
అడుగువేసి, ఎదలో యెదనుకలిపి, నవ్వులోనవ్వుగా చూపులో

చూపుగా అసలు నీలోన నేను నిండిపోయినతర్వాత జీవితమే మధు-
రం గీతా! నేను బ్రతికేదే అందుకు-

గీత : నేనంటే—నీకెందుకింత ప్రేమ.

మధు: తొలిసారిగా నిన్ను చూపినప్పుడు నాలో చెలరేగిన మధురభావాలకి రూపకల్పన చేయాలనే నీకు దగ్గర అయ్యాను. జాబిల్లిగా, జలతారుగా మెరుస్తూ- సెలయేరులా గలగలా - చిరుగాలిలా కిలకిలా - జల్లులా- వెల్లువలా నా అణువణువులో నిండిపోయావు. స్వర్గ సోపానాలమీ-కి నన్ను నడిపించుకువెళ్ళావు గీతా! నేను చాలా అదృష్టవంతుడిని,

గీత : లేదుమధు: ఈ అదృష్టం నాది, అదృష్టమంతా నాదే మధూ.

మధు: మనిద్దరిదీ గీతా! భగవంతుడు ప్రసాదించిన వరానివి నువ్వు. అందుకే. నా దోసిట్లో పడ్డావు. పరిమళాలు వెదజల్లే మరుమల్లె పువ్వు నువ్వు. అందుకే, సుడిగాలికో- చిరుగాలికో- రాలి నా పాదాలముందు నిలిచావు.

గీత : విధి విచిత్రంగా మనల్ని కలిపింది. ఇంత ఆనందాన్ని పంచి పెట్టింది, కానీ మధు, మనముందు సంఘం, సాంప్రదాయం అడ్డు వస్తున్నాయి.

మధు: ఈ అడ్డంకులు దాటినవాళ్ళు- సాంప్రదాయ సరిహద్దులమీద సంస్కృతిని మొలిపించినవాళ్ళు నిజమైన ప్రేమికులు గీతా!

గీత : పొత్తు తగ్గుల అడ్డుగోడలున్నాయిగా?

మధు: అడ్డుగోడల్ని పడవేసే శక్తులు మనకున్నాయి గీతా!

గీత : నిజమే మధూ! పెళ్ళయ్యేదాకా మనిద్దరం వేరువేరుగా వుంటేనే ముద్దుముద్దుగా వుంటుంది. తాళిగట్టి తలంబ్రాలుపోసి — ఏడడుగులు నడిచిన తర్వాత.... నన్ను ఏ లోకానికి తీసుకువెళ్ళినా ఎవ్వరూ మనకు అభ్యంతరం చెప్పరు. అప్పటిదాకా మనం ఇలాగే వుంటం మంచిది.

మధు: అలాగే గీతా, అలాగే నీ కోసం — ఎన్నియుగాలైనా ఎదురు చూస్తూవుంటాను. ముందు నేనుమారి, నిన్ను నావాన్ని చేసుకుని

తరతరాలుగా పేరుకుపోయిన ఈ దురాచారాలను ముక్కలు
చేస్తాను. సంస్కృతి మరచి - సాంప్రదాయాల ముసుగులో నివ
సించే యువతరాన్ని కళ్ళు తెరిపిస్తాను. దేశప్రయోజనానికి జాతి
ప్రగతికి ఆదర్శప్రాయంగా నిలుద్దాం గీతా. వస్తా. (అంటూ
వెళ్లాడు. గీత బై బై చెప్పింది. అతను దూరమయ్యేకొద్దీ ఆమె
అంతరాత్మ స్వాధీనంతప్పింది. అంతలో రమణ హఠాత్తుగా
బయటనుంచి వచ్చి గీతపరిస్థితి గ్రహించాడు.)

రమ : గీతా. గీతా. [చేతితోతట్టాడు కొత్త భయంగా]

గీత : [తేరుకుంది] ఓ.... నువ్వా బావా?

రమ : ఎంతటి కళ్ళకావరము! ఎంతటి అహంకారము!

గీత : ఎవరికి?

రమ : ఎండిన పెదాలపై నాలుగు చిర్నవ్వులు చిందించిన అందమైన
ముఖాన్ని- నూనూగుమీసాన్ని చూసి, సర్వంమరచి, మురిసి,
"ఏవా - బావా" అనుచుంటివా సుందరీ?

గీత : (నవ్వుకుంది) ఏమిటిబావా నువ్వనేది?

రమ : ఎవడా మదోన్మత్తుడు?

గీత : ఏదీ? (దిక్కులు వెదికింది)

రమ : యింతకుముందు ఇక్కడేనిలిచి - యింతలేపి కన్నులలో నిన్ను నిం
తగాచూసి, ఇచ్ఛకములాడి, ఇట్టే మాయమయిన ఆ దుష్టుణ్ణి
రెండుకళ్ళతో చూసిననన్ను పిచ్చివాణ్ని చేయాలని ఎతువేస్తున్న,
నువ్వెంత నీచురాలివో నేనెరుగకపోలేదు సుందరీ!

గీత : బావా!

రమ : మహిళాలోకం నిన్ను క్షమించదు సుందరీ. క్షమించనో క్షమిం
చదు.

గీత : అయ్యో భగవాన్. (తల పట్టుకుంది)

రమ : పదునాలుగు భువనమ్ములు నొక్కపెట్టున నెత్తివచ్చినమా, లెక్క
చేయక, ఒక్క గదాదండఘటనచేత, మగ్గడింపజేయగల, కౌరవ
సామ్రాజ్యాధిపుండు - సుయోధన సార్వభౌముండ తనయుండ

నగు నన్నే ధిక్కరించి – ఎవరినో నమ్మి హృదయాన్ని అమ్మి దారితప్పిన నిన్ను క్షమించనే క్షమించను సుందరీ!

గీత : చూడు బావా,

రమ : బావ ... ఎంత మధురము ఎంత మార్దవము. ఎంతమాధుర్యము, సుందరీ, ఏదీ, మరొక్కసారి. మమ్ములను "బావా" అతితీయగా పిలూ..

గీత : బావా.

రమ : ఆహా. జన్మ తరించినది సుందరి. అమృతము సేవించినంత తీయగావుంది మరొక్కసారి...

గీత : బావా.

రమ : ఆహా, ఇంకొక్కసారి.

గీత : బావా.

రమ : ఆ, బావా అని బాంధవ్యము కలిపినంత మాత్రమున చేసిన అపరము అ. క్షమ్యమగునవియా నీ అభిప్రాయము లేదుసుందరీ లేదు. అవక్ర పరాక్రమశాలి – అఖండ – ప్రచండ – ప్రతాప – ప్రభావోపేతుడు– నవరత్న ఖచిత సింహాసనాధికారము– హస్తగతము చేసుకుని – అంతరంగిక భటులతో – అంతఃపుర కాంతలతో – రేయి పగళ్ళుమరిచి – పాపపుణ్యాలు విడిచి – రక్తరాజ బిరుదాంకితుడ కావాలని – పూరట చెందుచున్న నన్ను కించపరిచి – వంచించిన నేరానికి – నిన్ను కఠినముగా శిక్షింపకుండిన – ఇక మేమెందులకు? మా రాజరికమెందులకు? మా కౌరవ వంశ గౌరవ ప్రతిష్ఠలెందులకు?

గీత : అబ్బబ్బ ఏమిటిబావా ఈ గోల?

రమ : అవమానము. సహించరాని అవమానము. ఎవరక్కడ? ఈ సీత రాలిని, బంధి చండి.

గీత : నేనుచేసిన అపరాధమేమిటో శలవిస్తారా మహారాజా?

రమ : పంచభర్తృకయైన – ద్రౌపది వలువలు నిండుకొలువులో ఒలిపించిన ద్యూత క్రీడా ప్రవీణ్యులైన – దుర్యోధన చక్రవర్తి కుమారుం

తనే - మోసముచేయ సాహసించిన నిన్ను విడువనా పాలెయ్య
కుందిన - మహారాజులమైన మాకు సిగ్గుచేటు - అయినా, మాకు
కోపమొచ్చినా - తాపమొచ్చినా - అవజాలమనీ - నీకుమనుపటి
సరసక్రీడా సమయమ్మున - విన్నవించలేదా సుందరీ.

గీత , నేనుచెప్పేది వింటావా? లేక, ఇలాగే గోలచేస్తావా,?

రమ : ఏమిటా అహంకారము, సభ్యతలేకుండా.

గీత : యిప్పుడేం జరిగిందని?

రమ : [నవ్వాడు హాస్యంగా] అవును, ఇప్పుడేంజరిగింది? బియాంసాలీ
గీతా! అనవసరంగా మూడొచ్చింది.

గీత , నాటకాలగొడవలో - నా ఊపిరి తీస్తున్నావు బావా.

రమ : నన్ను వట్టి నాటకాలరాయుడు క్రిందే జమకట్టావన్నమాట. ఇన్
సల్టు. గ్రేట్ ఇన్‌సల్టు మహానటుణ్ని పట్టుకుని - మరీచులకనగా
మాట్లాడితే కళామతల్లి క్షమించదు.

గీత : కళనూ - కళాకారుల్ని అవమానించటం నా ఉద్దేశ్యం కాదు.

రమ : మరేమిటి నువ్వనేది?

గీత . జీవితానికి కావలసిన కనీస వసతులు - కల్పించుకోకపోతే సంఘం
మనల్ని గౌరవించదు బావా. అప్పుడు మానవత్వం దూరమై
పోతాడు మనిషి.

రమ : గీతా, ఏమిటి నువ్వు మాట్లాడేది?

గీత : బజారున పడ్డ - కళాకారుల బరువు బ్రతుకుల్ని గురించి.

రమ : హుం, బ్రతుకులు, అన్నీ అతుకులు. గతుకులు

గీత : చూడు బావా. జీవితాన్ని తెగిన గాలిపటం చేసుకుంటావా?

రమ : గాలిపటాలైతే ఏ గమ్యానికయినా చేరుకుంటయ్ గీతా. కాని, కళా
కారుల జీవితాలు, సముద్రంలో పొంగే తరంగాల వంటివి.

గీతా : ఇన్నీ తెలిసి, ఈ అకలిజీవితాన్ని ఎందుకు కోరుకుంటున్నావ్.

రమ , అ. క. లి యిది కళాకారుల తపస్సుకి, మేధస్సుకి, భగవంతుడు
మిగిల్చిన ఆస్తిగీతా.

గీత : బావా.

రమ : అవును గీతా. ఉత్తమ కళాకారుల జీవితాలు చరిత్రకందని కన్నీటి ప్రవాహాలు. ఇన్‌కోర్స్ సమాజం మారలేదని. దరిద్రం తీరలేదని ఆరయాల్సి చంపుకుంటావా? లేదు, నేను చనిపోతే, నా సమాధి మీద ఓ పూలదండ వేస్తారు. సంతాపసభ చేస్తారు గీతా.

గీత : ఆ- అడగడమే మర్చిపోయాను. వెంకుబావ పేరుమార్చుకున్నాడుటగా?

రమ. పేరు మార్చుకోవడం - మనిషికో ప్రత్యేకమయిన సరదా గీతా.

గీత, ఏదో నాటకాలు రాస్తున్నాడుగా.

రమ : వెధవనాటకాలు నేనూ రాస్తాను. ఏం చేయను.

గీత. ఇంతకీ "మహర్షి" గా మారిపోయాడన్నమాట?

రమ. మహర్షిగదాని మనసిచ్చేవు సుమా. పట్టిపాలుచేసి ఊదుకుంటాడు.

గీత. అడిగిన ప్రతివాడికి ఇవ్వడానిక్కాదు బావా- మనసుంది, నచ్చిన వాడికి అడగకుండా ఇవ్వడానికి.

రమ. మరి, నేను నీకు నచ్చినవాణ్ని కాదా గీతా.

గీత. నీకేం బావా? చాలా అందంగా వుంటావు?

రమ. అందాల పోటీపెడితే, నేనే మొదటివాణ్ని అవుతానని మొన్న ఒకమ్మాయి చెప్పింది గీతా.

గీత. అందుకే బావా. నువ్వంటే .... నాకు చాలాయిష్టం.

రమ. నీకేమిటి గీతా. అందరికీ ఇష్టమే. ఎందుకంటే, నటుణ్నికనుక. అసలు నేను బజారునబయలుదేరితే, అంతా చేతులెత్తేవాళ్ళే కొట్ట డానిక్కాదు. నమస్కారాలు పెట్టడానికి.

గీత. ఆ, వెంకు-బావ గూడ .... ఇలాగే చెబుతాడు.

రమ. రంగురంగుల మాటలుచెప్పి ... మనసుకు రంగుపూస్తాడు గీతా. జాగ్రత్త.

గీత. నేనంత తెలివితక్కువదాన్నేం కాదులే బావా.

రమ. తెలివి ఎక్కువయినా ప్రమాదమేలే- ఎందుకంటే, నాలాంటివాళ్ళు కాలు ఆడుకునేవాళ్ళను నమ్ముకుంటే- నాలుగురోజులు హాయిగా బ్రతకొచ్చు. కాని... నాటకాలు రాసేవాణ్ని నమ్ముకుంటే -

నగలూ, నా జూకాలూ తీసి, నడిపెట్టెలో పడేసి.. గుడ్డెక్కె చెబుతాను గుర్తురానుకో — వస్తా. (అంటూ బయటికి వెళ్ళబోయాడు. గిత లోవికి వెళ్ళబోయింది. బయటనుండి మదన్ సిగరెట్ తాగుతూ వచ్చాడు)

మ . గితారాణీ.

గిత . (వెనక్కి తిరిగింది. అతనెవరో తెలీక మదుర మూపేసింది)

మ . ఏమిటి అలాచూస్తున్నావు?

గిత . మీరు ఎవరో గుర్తులేక-

మ . (నవ్వాడు) నా పేరు.... మదన్.

గిత . మీరేనన్నమాట?

మద. నా జాతకం తెలిసిందన్నమాట?

గిత . కొందరి జీవితాలు - జాతకాలు చెప్పకుండానే తెలిసిపోతాయ్ —

మద. అయితే ఇంకేం? నేనెందుకొచ్చానో చెప్పండి చూద్దాం.

గిత . మీరు చెబితేనే బాగుంటుంది.

మ . చెప్పటం నాకెప్పుడూ అలవాటులేదు గితా.

గిత . మీరు చాలా తమాషయినవారే-

మ . నాపనులు ఇంకా తమాషాగా వుంటయ్.

గిత . గారడీ చేస్తారా?

మ . గంగిద్దుల్ని ఆడిస్తాడు.

గిత . అర్థమైంది. ఇంతకీ మీరెందుకొచ్చారో?

మ . నీ కోసమే-

గిత . ఏమిటి మీరనేది?

మ . నన్ను మరీ అంత గౌరవంగా సంబోధించడం నాకు నచ్చదు గితా. కట్ కటుగా మాట్లాడటం - పట్ పట్ గా పనిచేసుకోవడం. నాకు ఖలేమోజు.

గిత . నేనడిగింది.... మీరెందుకొచ్చారని?

మ . నేను ఎవరనుకున్నావు గితా?

గిత . ఇప్పటిదాకా మనిషిననుకున్నాను.

మ . గౌరవస్తావు గీతా. అందాలు వెదికేవాణ్ణి.

గీత . తెలిసింది.

మ . ఆనందాలు పదిమందికీ పంచిపెట్టేవాణ్ణి.

గీత . యింకేమీ చెప్పక్కరలేదు.

మ . నాకు తెలుసు గీతా. చాలామంది ఆడవాళ్ళు నన్ను అసహ్యించుకుంటారు కౌగిలిరుచితెలిక స్వర్గానికే దారిచూపిన తర్వాత...వాళ్ళను వాళ్ళే మరిచిపోయి నా గుండెలమీద నిద్రపోతారు. చెరగనిముద్ర వేస్తారు.

గీత . చాలు... ఇకమీరేం మాట్లాడకండి.

మ . నీకు అసలువిషయం చెప్పనేలేదు కదూ?

గీత . దయచేసి వెళ్ళితేచాలు.

మ . మదన్ వచ్చినతర్వాత - పని పూర్తికాకుండా వెళ్ళడం చరిత్రలో లేదు గీతా:

గీత . అంటే... అంటే...? మీరు,

మ . అనవసరంగా ఎందుకు నన్నంత గౌరవంగా పిలుస్తావు? అందంగా మదన్ అంటేచాలు, అసహ్యంగా మాట్లాడితే చాలు. కసితో ద్వేషిస్తేచాలు. నోటికొచ్చినట్లు తిడితేచాలు. నన్ను నిజంగా ప్రేమిస్తున్నావని సంతోషంగా వెళ్ళిపోతాను,

గీత . ఓ మైగాడ్. ముందిక్కడనుండి వెళ్ళిపో.

మ . వెళ్ళకపోతే?

గీత . నాకు కోపంతెప్పించకు మదన్.

మ . కోపంలో యెరుపెక్కిన నీ బుగ్గలు చూడాలనివుంది గీతా.

గీత . ఛీ. యేమిటా మాటలు? మర్యాదగా బయటికివెళ్ళు- నేను తలుచుకుంటే - ఏమైనాయినా చేయగలను.

మ . (నవ్వుతూ హేళనగా) సరి, నేను తలుచుకుంటే - నిన్ను - నీ అందాన్ని - ఏం చేయగలనో - తెలుసా గీతా.

త . మదన్.

గీత, అదీ జన్మలో జరిగేపని కాదు.

మ. నాకోసం మరోజన్మకూడా యెత్తుతావా?

గీత. ముందిక్కడనుంది వెళ్తావా లేదా?

మ. వెళ్ళలేను గీతా. వెళ్ళిపోలేను. నా కళ్ళముందు. నగ్నంగానాట్యం చేస్తున్నట్లు నువ్వు కన్పిస్తుంటే - ఎలా వెళ్ళగలను? ఎటు వెళ్ళగలను? అందుకేగీతా? నువ్వే రా! నాగుండెలదాకా రా! నా హృదయం చల్లారేదాకా రా! నా కోరిక తీరేదాకా రా! రా గీతా రా! (అంటూ చేతులుచాపుతూ ఆమెమీదకు వెడుతుంటే - ఆమెతప్పుకుంది.)

గీత. యేమిటీదౌర్జన్యం? నీకిది న్యాయంకాదు. దయచేసివెళ్ళిపో మదన్.

మ. చూడు గీతా! వెళ్లూ వెళ్ళూ వెళ్ళూ అంటే నాకు చాలాకోపం వస్తుంది. అయినా నన్ను అవమానించడం నీ వుద్దేశ్యం అయితే నిన్ను బలవంతం చేయడం నా సిద్ధాంతం అవుతుంది,

గీత. మదన్.

మ. మర్యాదగా మాటవినని నీలాంటి రంగురంగుబొమ్మల్ని ఎలాలొంగదీసుకోవాలో ఈ మదన్ కు కొత్తేమీగాదు. రా.

గీత. నామ పో.

మ. ఒక్కసారేగా.

గీత. వీల్లేదు.

మ. గీతా!

గీత. వెళ్ళిపో.

మ. ఎంత అణకువగా చెప్పినా - అర్థం చేసుకోలేకపోతే - ఏమేం చేస్తానో తెలుసా? భవిష్యత్తులోకి సాగిపోయే నీ బ్రతుకు తీగను త్రెంచివేస్తాను.

గీత . మదన్.

మ . నీ రాతను తుడిచివేస్తాను.

గీత . వోర్కుయ్.

మ . నీ రాతకాన్ని మార్చేస్తాను.

గీత . మదన్, మదన్, నామీద నీకేమిటి పగ?

మ . పగకాదు గీతా! ప్రేమ, అభిమానం.

గీత . నీకు హృదయం లేదా?

మ . ఉందిగనుకనే.... మనిషిలా అడుగుతున్నాను. నాలున్న ఒక్క మనసులో .... ప్రేమ... అనురాగం ... మమత మానవత నిండి ఉన్నాయిగనుకనే నువ్వింకా మాట్లాడగలుగుతున్నావు గీతా. నేను నువ్వనుకునేంత నీచుణ్ణి కాదు. ఒక కమ్మని కౌగిలింతలో పులకించిపోవే అంటున్నాను, ఒక్క తీయ ముద్దుతో నన్ను ముగ్ధుణ్ణి చేయమంటున్నాను. ఎర్రని బుగ్గల్ని ఒకే ఒకసారి నా పెదాలకు అందించమంటున్నాను. ఇవన్నీ తప్పులయితే నీ ఇష్టమొచ్చినంతసేపు నన్ను నీ చేతుల్లో బంధించు బిగించు, [illegible]చేయి. నేను సిద్ధంగావున్నాను. కమాన్ గీతా. కమాన్. (చేతులు చాపాడు)

గీత . యూ ఫూల్ (కోపంతో పళ్ళుబిగించింది)

మ . గీతా. పెదాలపై పూరే మధువులూ. నిగలో విరిసిన మల్లెలు- యవ్వన వరువాలు- అమృత కలశాలూ - అన్నీ వృధా చేసుకుంటావా? వద్దుగీతా. నామీద నీకు ప్రేమ లేకపోయినా కసితోనయినా కౌగలించుకో కైపెక్కించి బయిదుచేసి కసితీర్చుకో రా గీతా. రా (అంటూ ఆమె వద్దంటున్నా వినిపించుకోకుండా కావలించుకున్నాడు. గీత పెనుగులాడి చెంపమీద కొట్టింది. మదన్ చెంప చేతితో పట్టుకున్నాడు; ఇంతలో బయటనుంచి మహర్షి వచ్చాడు.

గిత లోంచి కారు కొచ్చి కెళ్లిపోతున్న మదన్, మహర్షి ఒక నౌకరు చూస్తున్నాడు.

మహా. దెబ్బ తగిలిందా?

మద లేదు ఆమె వేసిన ముద్రలు చెరుపుకుంటున్నాను.

మహ జీవితమ్మీద ... కాలం ఎన్నో చెరగని ముద్రలు వేస్తుంది.

మద . వాటిని చెరపమంది నేను కాదు, ఈ సంఘం, ఈ మనుషులూ, ఈ పరిస్థితి.

మహా. సంఘంలో నువ్వూ ఒక మనిషివేగా?

మద . మనిషినే... కాని నన్ను మానవత్వంకు దూరం చేసింది ఈ సంఘం.

మహ (నవ్వుతూ) నువ్వే దూరమైపోతున్నావు.

మద . దానికి కారణం తెలుసా?

మహా. నీ అంతరాత్మ నడిగిచూడు.

మద . అదీ చచ్చిపోయింది ఇప్పుడు, ఎప్పుడో, ఎప్పుడో చచ్చిపోయింది సజీవంగా సమాధైపోయింది. అందుకే దారి మార్చుకున్నాను.

మహా. ముళ్ళదారుల్లో నడిస్తే — బ్రతుకునిండా గాయాలవుతాయి.

మద . గుండెపగిలి ముక్కలై పుండుగా మారినతర్వాత బ్రతుకుమీద గాయాలకు భయపడనవసరం లేదు.

మహా. మనిషిలా జీవించడం నీ కిష్టంలేదన్నమాట?

మద . జీవితాన్ని కసిగా అనుభవించడం నాలాంటివాళ్ళకు చాలా అవసరం.

మహా. నీ అవసరాలకోసం ఇతరుల బ్రతుకులమీద నిప్పులు పోస్తావా?

మద వాటిని రక్షించటానికి కావలసినవాళ్ళు దొరికితే అదృష్టవంతులవుతారుగా.

మహా. యిది ఒక అదృష్టమే: నిముష నిముషానికీ తలొంచి ... మనిషి మనిషికి చేజాపి- చట్టానికి సంఘానికీ, భయపడుతూ- నరకాన్ని ప్రత్యక్షంగా అనుభవించటం కూడా - ఒక అదృష్టం దాన్నిమతో కరు పంచుకోవాలి,

మద . గీతను ప్రేమిస్తున్నావా?

మహా. ప్రేమించటం నరదాకాదు.

మద . యేమిటి నువ్వు మాట్లాడేది?

మహా. విషాదాన్ని, విశాదాన్ని ఇతరుల బ్రతుకులమీద చల్లకు అంటు న్నాను.

మద . మదన్‌కు యెదురుచెప్పినవాళ్ళు యింతవరకూ యెవ్వరూలేరు.

మహా. బ్రతుకుమీద ఆశ - భవిష్యత్ మీద తిపి నాకు లేదు.

మద . నువ్వు అబద్ధాలు నిజాలుగా మార్చేవాడివి,

మహా. యేమిటి నీ ఉద్దేశ్యం?

మద . నీ అంతరాత్మ నడిగిచూడు వస్తా. (వెళ్ళబోయాడు)

మహా. యింకెంతకాలం సాగిస్తావు ఈ అరాజకాలు?

మద , బ్రతుకు స్వర్గం అయ్యేదాకా.

మహా. స్వర్గాన్ని చేతులారా నువ్వే నరకం చేసుకుంటున్నావు?

మద. కాంతివిలువ తెలిసేదాకా చీకటి వుండాలిగా,

మహా చావు సిద్ధంగా వుందనే మనం బ్రతుకుతున్నామా?

మద . బ్రతుకులన్నీ యెప్పుడోసారి చావు తన్నుకుపోతుంది మ ార్షి! వస్తా. (వెళ్ళబోయాడు)

మహా . మళ్ళీనా?

మద , ఇప్పుడు నువ్వు రాకుండావుంచే మళ్ళీ నేను రావలసిన పని ఉం దేదికాదు వస్తా [అంటూ చరచరా బయటికి వెళ్ళాడు గీతఎదురుగా బయటికొచ్చింది.]

మహా. ఏడుస్తున్నావా గీతా?

గీత. నాకు మిగిలింది ఏడుపేగా బావా. [దుఃఖం ఆగలేదు]

మహా. శిలామూర్తి కన్నీళ్ళు భూమాత భరించలేదు గీతా.

గీత. బావా!

డాహ. తరతరాల పాపపంకిలంతో తడిసి - ముద్దయి పసిడిపంటలువండే తెలుగుగడ్డ - విస్ఫారమై విశ్వైక్యమై మట్టిగానే మిగిలిపోతుంది గీతా.

గీత నీ సానుభూతికి యెలా కృతజ్ఞతలు తెలుపను బావా ఎలా అభినందించను?

మహా. నాకో సహాయం చేస్తావా గీతా?

గీత. నీకూ మనసుకావాలా బావా?

మహా. ఇష్టంలేని మనసును అడిగి పుచ్చుకునేంత అవివేకినికాదులే గీతా.

గీత, ఏం చేయమంటావు బావా?

మహా. మెరిసే కనుపాపలనుండి కురిసే కన్నీళ్ళకు - అర్థం చెప్పాలని వుంది.

గీత. నా బ్రతుకును బజారుపాలు చేస్తావా బావా!

మహా. గీతా.

గీత. నీ అభ్యుదయ భావాలకూ - కవితావేశాలకూ నన్నో కథావస్తువును చేసి - సాహిత్యంతో - చైతన్యంతో - ఒళ్ళంతా గాయాలు చేస్తావా, నేనేం తప్పుచేశాను బావా? ఆడదానిగా పుట్టిన నేరం కన్నా - యింకేం చేశాను?

మహా. రావణుడు గడ్డతోసహా పెకలించుకుని లంకకు మోసుకెళ్ళిన సీత కూడా ఆడదే గీతా.

గీత. అందుకే బావా. అవమానాలూ, అనుమానాలూ సహించలేక అగ్నిలో దూకింది.

మహా. నిండు కొలువులో వలువలు వూడదీస్తుంటే కురుల విప్పుకుని మానాభిమానాలు కాపాడుకున్న ద్రౌపదిగూడా ఆడదేగా,

గీత . ఐదుగురు భర్తలున్నా అడవుల పాలుగాక తప్పలేదుగా.

మహా, వయసు తరిగిపోతున్నా కొలదీ వచ్చేది ముసలితనమే గీతా.

గీత . అయినా ఆడదానికి అగ్నిపరీక్షలు భగవంతుడు ఎందుకు పెట్టాడు బావా?

మహా. నీ ప్రశ్నకు సమాధానం లేదు గీతా.

గీత . నా బ్రతుక్కిగూడా పరిష్కారం లేదు బావా?

మహా. ఉంది గీతా. అందుకే నేను కలంపట్టాను,

గీత . ఏపనీ లేనప్పుడు ఏదో ఒకటి చేయాలిగా.

మహా . నాకెంత పేరుందో నీకేం తెలుసు?

గీత : ప్రతి మనిషికి.... ఏదో ఒక పేరు ఉంటుంది బావా.

మహా: అయితే ... మనుష్ని చంపేవాడు - మానవతను పెంచేవాడు ఒకటేనంటావా?

గీత. మంచి చెడ్డులమధ్య దూరం నాకుతెలుసు బావా.

మహా: తెలిస్తే... నువ్విలా మాట్లాడవు గీతా చంద్రమండలం వెళ్లేవాడికి తిరుపతికొండ మెట్లు ఎక్కేవాడికీ - పెతేదాద్దలేదంటే - నిన్నే మనాలో అర్థం గావటంలేదు.

గీత : నన్నింతవరకే జమ కడుతున్నావన్నమాట.

మహా; లేదుగీతా. నువ్వునటివి. మహానటివి, నీలో ప్రకాశించే కళా తేజం.... ప్రపంచపు అంచులదాకా ... ప్రసరించాలి.

గీత : స్వార్థానికి హద్దుండాలి బావా.

మహా, ఆకాశానికి అంతుందా గీతా?

గీత : బావా.

మహా: అవునుగీతా, మనిషి బ్రతకాలంటే - స్వార్థం కావాలి. పొదబెట్టడానికి - కుబేరుడు కావడానికీ స్వార్థం కావాలి. ప్రేమించడానికీ-

పేరు గడించడానికి స్వార్థం కావాలి. అసలు ప్రతివ్యక్తిత్వంలోకి

పయనిస్తున్న మనిషి ప్రతిక్షణంగా స్వార్థమొక్కదే .. పడుతుంది. ఎంతోమంది జీవితాలు ఈ స్వార్థపు సోపానాలమీదే స్థిరపడ్డాయి. చిగురించాయి కూడా.

గీత : గుండెల్ని ఛిద్రంచేసే .... స్వార్థానికి లొంగి - అంతరాత్మను మోసం చేసుకోలేను బావా. వస్తా! (వెళ్ళబోయింది)

మహ: ఆ.... గీతా అసలువిషయం చెప్పడమే మర్చిపోయాను మొన్న "కొంపలు తగలడాయ్" అనే గేయం రాశాను... విన్నావుగా!

గీత : "కొంపలారి పోతున్నయ్" అనికూడా చెప్పావుగా-

మహ: అవునవును... నిప్పు రాజుకున్న తర్వాత - నిప్పుపోయటం — ఆరిపోవడం జరుగుతుందిగా- ఇవ్వాళ గుళ్ళో సాహితీసదస్సు వుంది. వస్తావుగదూ!

గీత : సారీ బావా! నేను ఆడదాన్ని.

మహ: నేను నాగరికతాలోకంలో ... వీడే పై చేయి.

గీత : వేయిదాటిన తర్వాత ... మనం కావాలనుకున్నవి, కోరుకున్నవి ఏమీ తిరిగిరావు బావా. నువ్వెళ్ళిరా-

మహ: చూడుగీతా. మొన్న గుళ్ళో ఉపన్యాసంచెబితే, చెప్పగూడదు గానీ ... ఎన్నిచప్పట్లు- ఎన్ని దండలు- అబ్బం మల్లెపూలతో గుచ్చినదండలు - తల మునిగిపోయిందంటే- నమ్ము—

గీత : ఇప్పుడు నాకు తలమునిగిపోయేంత పనుంది బావా. వెళ్ళిరా- (అంటూ లోనికివెళ్ళింది. మహర్షి నిట్టూర్చి బయటికి వెళ్ళాడు. తెర జారింది)

# రెండవ రంగం

(అలంకరణ మొదటిరంగంమాదిరేవుంది, గీత విచారంగాకూర్చుని
వుంది మధు గులాబి తీసుకుని బయటనుంది వచ్చాడు)

మధు : గీతా.

గీత : (చూసింది - విరాళవిండిన ప్రేమతో)
మధు : ఈ గులాబి ఎంత అందంగావుందో చూడుగీతా.
గీత : దేవుని పాదాలవద్దకు చేరినప్పుడు ఇంకా అందంగా వుంటుంది
మధూ కాని.... గండు తుమ్మెదలు దాని విందుజీవితాల్ని కలుషి
తం చేయకముందే కాపాడటం మంచిది.
మధు : ఏమిటి గీతా? పరధ్యానంగా మాట్లాడుతున్నావు
గీత . రక్షణలేని పువ్వులాగా .... నా జీవితం ...

మధు : అదేమిటిగీతా. మధు జీవించివుండగా నీకేమీ అన్యాయం జరగదు.
జన్మజన్మలకూ ... నువ్వూ- నేను భార్యాభర్తలం గీతా.
గీత : మధూ!

మధు: చూడుగీతా. పరీక్షలు పూర్తికాగానే ఇంటికి వెళ్ళి నాన్నను ఒప్పించి
పెళ్ళిఏర్పాట్లు చేస్తాను అప్పటిదాకా ... నిన్ను నా గుండెల్లో దాచు
కుంటాను.

గీత : మధూ.

మధు: నువ్వు నాకు తోడుగావుంటే – అన్ని సంపదలూ ఉన్నట్లే. నీ నవ్వుల పువ్వులు వికసిస్తేచాలు, నా హృదయం పరవశించి పోతుంది,

గీత : నిజంగా నేనంటే నీ కెందుకింత అభిమానం?

మధు: నీతో నిండయిన హృదయం నందిగితా. ఆ హృదయంనిండా నేను న్నాను. అందుకే – అందుకే గీతా నువ్వంటే నాకిష్టం. (అంటూ ఆమెబుగ్గ గిల్లాడు)

గీత : అబ్బ. ఏమిటి చిలిపిచేష్టలు–

మధు: అందమయిన ఆడపిల్ల – అందుబాటులో వుంటే– మగవాళ్ళు ఏం చేస్తారో మరి?

గీత హద్దులు దాటితే – పెద్దలు కోప్పడతారు. దయచేసి.... వెళ్ళండి.

మధు: మరి ... మన మామూలు...

గీత : మామూలా– అదేమిటి?

మధు: (ముద్దు అన్నట్లు తెలిపాడు)

గీత : అబ్బాయిగారికి ఎంతాశ (అతని బుగ్గమీద చిటికెవేసి వెళ్ళబో యింది– మధు.... ఆమెపైట లాగాడు) అబ్బ యెవరయినా చూస్తారు.

మధు: చూడనీ – తొందరగా వెళ్ళయినా చేస్తారు.

గీత : మరీ అకతాయివై పోతున్నావు.

మధు: నువ్వు అకురాయివై పోవడంలేదు?

గీత : ఛీ పో– మొండి (అంటు వెళ్ళబోయింది – మధు అడ్డగించాడు. ఇదరూ డ్యూయెట్ పాడుకున్నారు. పాటచివర విడిపోతారు. క్షణం నిశ్శబ్దం.. బయటనుండి మహర్షి వచ్చాడు. ఓ మహాశిలా భోజాలో నిలబడి ఆలోచిస్తున్నాడు. ఇంతలో రమణ వచ్చాడు.)

రమ : ఏమిట్రోయ్ కవి దీర్ఘాలోచనలో పడ్డావు?

మహా: యేం లేదురా. మద్రాస్ వెళదామని-

రమ చూడు మహాశ్రీ. అక్కడ మానవతలు వచ్చిపోయా ం చెప్పిన వాళ్ళంతా బ్రతుకుతున్నారు. శీలాన్ని ఎరవూపేవాళ్ళు. సిగ్గుని విరజిమ్మేవాళ్ళు- ఆత్మగౌరవాన్ని అమ్ముకునేవాళ్ళు - అమహా నగరంలో ఖరీదులేని వస్తువులు. అందుకే మహాశ్రీ. కళామతల్లి కుళ్ళికుళ్ళి ...ఏడుస్తూంది.

మహా: వ్యక్తిత్వం లేనివాళ్ళు- ఇక్కడావున్నారు రమణా?
రమ : వాళ్ళగొడవ మనకెందుకులే-

మ : నీ గొడవేమిటో చెప్పు-

రమ : నేనోకథ చెవుతాను. నాటిక రాసిపెడతావా?

మ : ట్రై చేదాం చెప్పు.

రమ : అయితే నన్ను పూర్తిగా మూడ్ లోకెళ్ళిపోని- (అంటూ ఆలోచిస్తూ రెండడుగులు నడిచాడు) ఆ.... వచ్చినది మహాశ్రీ. మూడ్ వచ్చినది- ఇప్పుడు మా నటన ప్రశంసనీయం. నటులూ - మహా నటులూ అందరూ మనకు తల వంచవలసిందే ఆహా. మూడ్ వచ్చినదిగాని ఏదో మాటాడుచుంటిని- మహాశ్రీ. నేనో చిన్నకథ చెబుతానంటిగదా చెప్పితిని.

మ : అవును మహాశయా చెప్పితిరి, చెప్పితిరి.

రమ , అది ఒక ఉద్యానవనము.

మ : ఆ వనమందొక మేడ. మేడపైన,

రమ : కాదు మహాశ్రీ. ఆ ఉద్యానవనమున కొంచెము విశ్రమించుదమని జని- అచ్చటి పూ పరిమళాలు తృప్తిగా నాఘ్రాణించి—

తిరిగి అంతఃపురమున కరుగుచుండగా – నడివీధిలో ఒక అడుది వచ్చినది మహర్షి.

మహ: (నవ్వాడు) ఒరేయ్ నాటకాలు ఆడేవాళ్ళను చూసి నవ్వక–నాగరి పద్దేవాళ్ళను చూసి నవ్వుతారా ఆడవాళ్ళు నీ పిచ్చిగాని.

రమ: ఊరకే నవ్వుకొనిన మాకింత వేదన- ఆ వేదన యేల కలుగును ఆ సమస్త శాంగి మమ్ములను చూసియే నవ్వింది.. వాడి వాడి అమ్ములను రువ్వినది మహర్షి.

మహ: చాలా అదృష్టవంతుడివి

రమ: ఏమోమ – స్త్రీ తలచుకున్న కొలదీ- గుండెను తొలిచినట్లు అవు తున్నది. ఏలనో మనసంతా.. వెర్రిగంగులెత్తుచున్నది. అవగలాడి వాలుచూపులు మదీయ హృదయ కుసుమాన్ని గాయము చేసి నవి.

మహ: ఇంతకూ మందేమీ వేయలేదా?

రమ: కొంచము ఊరట కలిగినపిమ్మట – వళ్ళంతా తడుముకుని- చూసు కుంటిమిగదా – మా అవయవాలలో చిన్న లోపము కానవచ్చి నది మహర్షి.

మహ: అదేమిట్రా?

రమ: అవును మహర్షి ఉన్నవి. ఉన్నచోట వున్నవిగాని గుండె మాత్రము.. మొరటి గురుతులో లేక – యెక్కడో వేగిపోవు చున్నట్టు అయినది అందుకే.. మేము ఆ పూబోడిచెంతకు చేరి తిమి ఆ సుకుమారి.. సగౌరవంగా తన మందిరానికి ఆహ్వానించి నది కూడ

మహ: ఆమె అందంగా ఉందన్నమాట?

ర . ఆహా, ఆ వయ్యారి అందము గురించి - ఒక ప్రబంధము వ్రాయ
వచ్చు మహర్షీ.

మ రంభ - ఊర్వశి - మేనక - తిలోత్తమలు ....

ర అమె కాలిగోటికి సరితూగరు మహర్షీ, అంతఃపుర కాంతలతో సరి
తూగవలసిన నెచ్చెలి, ఒక సామాన్యులి ఇంత తనసౌందర్యానికి
ముసుగుపెసుకోమట, ఎంత సిగ్గుచేటు. ఎంతశోచనీయం.

మ : ఇంతకూ ఏం చేశావో చెప్పరా.

ర : ఆ అందాలబాలగు అక్కున చేర్చుకుని - ముచ్చట తీర్చుకోవాలని-
ముచ్చటపడిపోయాను.

మ : ఒప్పుకుందా మరి.

ర : మహర్షీ, ఏల నీకీ తొందర? నీకూ మా, వట్కు పులకరించి పోవుట
లేదుగదా.

మ : లేదులేవోయ్- త్వరగా ఆఘోరించు-

ర : సుందరీ. మమ్ములనుచూసి- తలవుచాటునవేవి- ఎందుకువిచ్చితివి?
మా గుండెలను ఎందుకిలా లాగితివి? అవి, ముందుగా వేసితివి.
ప్రశ్న.

మ : నిన్ను ప్రేమించానందా?

ర : ఆ లేతపెదవులనుండి, ఆ తీయనిమాట వస్తుందనే, ఆశ కాని, ఆ
బేల కన్నీరు కార్చినది.

మ : ఎందుకురా?

ర : నేనూ ఆ ప్రశ్న వేసితిని ఆమె మరీమరీ, వెక్కి వెక్కి ఏడ్చినది.
అప్పుడు మాకు ఆ జవరాలుమీద జాలి కలిగినది. దేవీ! ఏమిటా

కన్నీరు? ఎందుకిలా వెక్కి వెక్కి ఏడ్చుచుంటివి? అని గుచ్చి గుచ్చి అడిగితిమి.

మ : ఏం చెప్పింది?

ర : హృదయం ఒకసారే ముక్కలయ్యే మాట చెప్పినది. యువరాజా. నేను అందరినీ చూపి నవ్వుతాను మా ఇంటి తలుపులు ఎప్పుడూ తెరిచే వుంటయ్. అని చెప్పినది.

మ : అప్పుడు గదా, మా చిత్తము చిత్రవధ అయినది! అవును మేము విశ్రాంతికొరకు ఆ ఉద్యానవనమ్మునకు ఏల పోవలె? పోయితిమి పో - గృహోన్ముఖులమై - పట్టణ మధ్యంబున కేల నేగవలె? ఏగితిపో, ఒక వలపుకింత, ఏకాంతముగా మమ్ములను చూసిఏల నవ్వవలె?

మ : నవ్వెనుపో - ఆ సుకుమారి పుట్టుపూర్వోత్తరాలు గుర్తింపకయే ఇంటిలోని కేల నరుగవలె?

ర : అరిగితిపో - ఆ వయ్యారి ఏల వెక్కి వెక్కి ఏడ్వవలె?

మ : ఏడ్చెనుపో -

ర : మేము యుక్తాయుక్త విచక్షణ విస్మరించి ఆమెను గుచ్చి గుచ్చి ఏల....

మ : [నవ్వాడు. రమణ శృతికలిపాడు]

ర : ఎలావుంది మనకథ?

మ : బాగుందిరా - చాలా బాగుంది - నా కలంలో బిరా నాభావం లో జీవం ఇప్పుడు చూపిస్తాను. తప్పకరాస్తాను.

ర : ఓ, ఐయాంసారీ మహర్షి వస్తా! [వెళ్ళబోయాడు]

మ : ఒరేయ్ రమణా!

ర : అన్నట్లు నీకేమీ చెప్పలేదు గదరా?

మ : ఎందుకు చెప్పలేదు? ఉద్యానవనము-నదివీధి- వాలుచూపులు- ప్రీతి వాకిలి- నవ్వులూ - పువ్వులూ- తర్వాత ఏడ్పులు—

ర : అవేం కాదురా, ఇవ్వాళ నాకు సన్మానం.
మ : యెవర్రా చేస్తుంది?

ర : ఎవరో చేస్తే నోరు మూసుకుని కూర్చుని చేయించుకో దానికి- నేను మామూలునటుణ్ని కాదు మహర్షీ మహానటుణ్ని.

మ : నువ్వే ఏర్పాటు చేసుకున్నావన్నమాట.

ర : షైకూ- శాలువా- పూలదండలూ యిచ్చిమరీ చేయించుకుంటున్నాను అంతేకాదు — చప్పట్లు కొట్టడానికి కాఫీ ఇప్పించి - ఓ పాతిక మందిని రెడీచేశాను కూడ.

మ : [నవ్వాలని ప్రయత్నించాడు] ఒరేయ్ రమణా ఇప్పుడిప్పుడే నీలో మినిష్టరయ్యే సూచనలు కన్పడుతున్నాయి రా—

ర : ఒరేయ్ మహర్షీ, మొన్న పరిషత్తులో గెల్చుకున్న రెండు వెండి కప్పులూ, షీల్డూ- మార్వాడీ షాపులో మర్యాదగా తాకట్టుపెట్టి- చేయించుకుంటున్నామురా వస్తా [అంటూ రెండడుగులు లోనికి వేసి శాలువా భుజంమీదుగా కప్పుకుని వచ్చాడు] చూడు మహర్షీ, ఇప్పుడు నేనెలా వున్నాను?

మ : ఓ మహాకవిలా వున్నావు?

ర : కవులతో పోల్చకురా బాబూ. కాఫీనీళ్ళు కూడా దొరకవు.
మ : అదిసరే— ఇవ్వాళ మేము ఫోటో తీయించుకోబోతున్నాం- ఆ శాలువా— —

ర : కావాలా?

మ : కావాలని కాదు. మొన్నమొన్ననాకు చేసిన సన్మాన సందర్భంగా- దీన్ని

కప్పాడు. ఇవ్వాళ ఫోటో తీయించుకుందాం అని చెప్పారు.

ర : ఒరే మహర్షి ఒకే ...తీసుకో. [శాలువా తీశాడు] ఒరేయ్ హంగుల కోసం- అందంకోసం - నేనీ శాలువా కప్పుకోలేదురా - చొక్కా చిరుగులా- అతుకులా- బయటపడకుండా వుండాలని కప్పుకు న్నాను. ఇంకో గంట ఆగితే.... బ్రహ్మాండమైన కాశ్మీరుశాలువా నా భుజాలమీద వుంటుందిరా- తీసుకో మహర్షీ [మహర్షి మీదకు విసిరేశాడు]

మ : (శాలువా సర్దుకున్నాడు) రమణా.

ర : ఒరేయ్ సభలో పాల్గొనడానికి- సన్మానాలు చేయించుకోవడానికి- యీ బోడిశాలువాలు అక్కర లేదురా, ప్రజాభిమానం, కళాప్రతిభ కావాలి. వస్తా (రెండడుగులు వేశాడు బయటికి)

మ : కోపం వచ్చిందా రమణా.

ర : [నవ్వాడు] చూడు మహర్షీ ఎన్నో ఏళ్ళుగా కాఫీలు తాగితాగి— కోపాన్ని కరిగించి- కరిగించి, కరుణారసంగా మార్చుకున్న మన లాంటి వుత్తమ కళాకారుల కళ్ళల్లో, యింకా కోపాలూ, తాపాలూ యెక్కడున్నాయిరా.

మ : ఎందుకురా అలా బాధపడతావ్?

ర : మొదటసారిగా నేను వేదికమీద నటించినప్పుడు నా ప్రతిభకు మెచ్చు కుని మ్రోగించిన చప్పట్లు విన్నప్పుడు నా కోపం చల్లారిపోయింది. ఒరేయ్ ఇప్పుడు కోపంవచ్చి, గుండెను పగులగొట్టుకుని- గట్టిగా ఏడ్చినా, వచ్చేదిమాత్రం కన్నీళ్ళుకాదు మహర్షి. వస్తా [వెళ్ళబో యాడు- సత్యం బయటనుండి ఎదురయ్యాడు)

స : ఏమిటీ కన్నీటి కబుర్లు?

మ : కళాప్రతిష్ఠకు- కన్నీళ్ళే ఖరీదు. అంటుంటే యింకా యీ కాలం క్షమిస్తుందేమిటి అంటున్నావు? (గీత లోపలనుండి వచ్చింది)

గీత : ఎంతసేపయ్యిందన్నయ్యా వచ్చి?

స : ఇప్పుడేనమ్మా

గీత : మరి... వెళ్ళినపని ...

రమ : మామూలే గీత, మనం ఉద్యోగాలకోసం... వెతుకుంటూ బయలు దేరితే నో వేకెన్సీ బోర్డులు—మన కెదురవుతాయ్. అంతే గాదా?

స : అవున్రా! సర్టిఫికెట్ చూపినా — సత్యంపేరు వినగానే సరే — పోయిరా అంటున్నారు.

గీత : ఎందుకని?

స : అంతేనమ్మా! సత్యం కేవలం సత్యాన్ని రక్షించడానికే పని కొస్తాడట—

మహా: అంతే బావా! వ్యాపార సంస్థల్లో సత్యం చచ్చిపోయిందిగా—

రమ : ఫ్యాక్టరీల్లో కూడ—సత్యం వెలిగిపోయింది గీతా!

గీత : చైర్మనుగారు...ఏమన్నారన్నయ్యా?

స : మొన్నటి మాటనిన్న—నిన్నటి మాట యీ రోజు— అంటూనే వుంటాడమ్మా! ఆయనకేం మహారాజు.

గీత : ఇకమనం ఎలా బ్రతకాలన్నయ్యా?

స : దోసెడు దుఃఖం వుందిగా గీతా, తృప్తిగా తాగి కడుపు నింపు కుందాం, అసలు మన కళ్ళలో కన్నీళ్ళు వుండాలేగాని యీ జన్మకు కరువేలేదు గీతా.

గీత : అన్నయ్యా.

స : అవునమ్మా, అంతే అంతే.

మహా: కష్టపడి చదివి ... బియ్యేడిగ్రీ సంపాదించాడు బావ. ఇప్పుడు దాన్ని తాకట్టుపెట్టినా—కొనేవాడూ లేడు. పాపం అనేవాడూ లేడు.

రమ : సారా బట్టీకూ— సానివత్తుకూ— పర్మిషనువుంది. గీతా. కాని....

చదువుకున్నవాడు ప్రతికథానికే-కఫీనం లావడానికూడా, ఒక్క కోడి దిక్కుమాలిన చట్టం.

వ : అందుకేరా-అందుకే.... ఎంతోమంది విద్యాగ్యులు నిక్కృష్టులూ- యీ కసాయి మూకల కాళ్ళక్రింద నలిగిపోతున్నారు పదవుల విషాలో, మధువుల కుషిలో. మంచిని మానవతనూ-చిత్రవధ చేస్తున్నారు మానతంగాలూ-మారణ హోమంతో, యీ రామరా జ్యాన్ని రాక్షస రాజ్యంగా మారుస్తున్నారు.

మహ: ఊడిగంచేసే వాళ్ళంటే-ఉపేక్షచూపని అధికారులు, ఊపిరితోసే వాళ్ళంటే, ఉలిక్కిపడతారు.

వ : అందుకే మహర్షి నాకు వుద్యోగం అక్కర్లేదు.

గీత : అదేమిటన్నయ్యా?

వ : అవునమ్మా, గుక్కెడు చైతన్యం తాగుతాను.

గీత : అన్నయ్యా

వ : బ్రాందీలూ, విస్కీలూ, తాగి, పదవి బాధ్యతలు విస్మరించి- ప్రజల్ని మర్చిపోయిన, పాలకుల కళ్ళు తెరిపిస్తాను. ఈ దేశ పురోభివృద్ధికో, మెట్టునై, భావితరాల పేరులకు, చైతన్య ప్రవంతినై, అధికారపు మత్తులోవున్న పెత్తందార్ల నరనరాలో ప్రవహిస్తాను ఆ అహంకారుల అణువణువులోచేరి, అడుగడుగునా, అగాధం సృష్టిస్తాను.

గీత : అన్నయ్యా.

వ : అదేనేను చేయవలసిన పని గీతా. నాకు మిగిలిన పనికూడా అదే, ఆస్తులు అమ్ముకుని, అహోరాత్రులు శ్రమించి, చదివి సంపాదించిన విద్యని తిగ్గి, నన్ను చూసి, పదేపదే ఎగతాళిచేస్తుంటే, ఇంకా నేనెందుకు క్షమించాలి యీ పెద్దరికాన్ని? ఒరేయ్ తమ్ముడా. యీ కళలూ, కవితలూ జీవితాన్ని వుద్ధరించలేవురా.

శేషు : ఉద్ధరిస్తాయని కాదు బావా, ఇలాగే నాటకాలు ఆడి ఆడి, పిచి కూలో చేరిపోతే....

న : అప్పుడుగాని — మిగిలివున్న మానవత, మంటగలిసిపోదు— ఒరేయ్ నాటకాలు ఆడి బాగుపడిన వాళ్ళు కవిత్వాలతో బ్రతుకుల్ని దిద్దుకున్నవాళ్ళు, మనదేశంలో లేరు వుండరుకూడా.

మహా: లేరనికాదు బావా. ఉన్నారు....కాని....

న : మహర్షి ఈ దేశంమీది, ఈ సంపదమీది, కనిపించే ప్రతివస్తువూ మీది. వీటిని అనుభవించే హక్కు ప్రతిమనిషికీ వుంది. కాని... మనం... పశువులకన్నా హీనంగా బ్రతుకుతున్నాం, విసిరేసిన విస్తళ్ళలోని మెతుకులకోసం వెదికే కుక్కలనయం మనకన్నా అరవచాకిరీ చస్తే...దానికి ప్రతిఫలం? ఆర్ధాకలి. ఒక్క కష్టజీవి కండల్లో స్రవించిన చెమటబిందువు ఖరీదు కన్నీటిబొట్టు ఒక్క కార్మికుని శ్రమకు ఫలితం? వేడి నిట్టూర్పు. కూటికోసం...కుల వయసు శీలాలు తాకట్టుపెట్టే పరిస్థితికి దిగజారినా కనీసన్యాయం చూడని యీ స్వార్థపరుల నిరంకుశత్వాన్ని ఎందుకు క్షమించాలి?

శేషు : ఇలా గొంతెత్తి పెద్దగా అరిస్తే...వాళ్ళు విరగ్గొడతామంటున్నారు బావా - పోలీసులు.

మహా: అవును బావా. సమసమాజ స్థాపన కావాలన్నా. ఈ సంపదలో మాకూ భాగం వుండాలన్నా-తుపాకి తూటాలు దూసుకుపోతున్నాయ్ గుండెల్లో - ఎంతమంది మహనీయులు తమ పవిత్రమైన రక్తాన్ని చిందించలేదు? ఆ త్యాగమూర్తుల రక్తంలో నుండి - మళ్ళీ త్యాగం గాని-రక్తంగాని-చిగురించిందా? కనీసం మిగిలినవారి బ్రతుకుల్ని అయినా-పరిచేసిందా?

న : ఈ మూఢ విశ్వాసులు ముందు విరగ్గొట్టాలి? కృతజ్ఞతలేని చట్టాల కోటగోడలు పడగొట్టాలి. మతాధికారంతో-రాజకీయాధికారంతో

భావికరాల బాటలు వేరిపే — వి త్తందార్దనుపట్టి అధికార భ్రష్టుల్ని చేయాలి సముధర్మం—సహభావం—వికురింపజేయాలి.

రమ : విప్లవం కావాలంటావా బావా?

వ : ఏదేశంలోనైనా—విప్లవంతోనే సమత పుట్టిందిరా—

గీత : చూశన్నయ్యా. ఈ విప్లవాలవీ—ఉద్యమాలవీ బ్రతుకుల్ని చీకటి చేసుకుంటారా?

వ : ఏమిటమ్మా మవ్వనేది?

గీత : దేనికైనా అర్హత కావాలి. జేబులు కొట్టాలన్నా జైలుకు వెళ్ళాలన్నా తగినవాళ్ళే కావాలి. మనం పేదవాళ్ళం. మన జీవితాలు అరిటాకులు ముళ్ళపొదల్లాంటి అధికారంమీద పడితే నష్టం మనకే—

వ : నిజమే గీతా! కాని....ఈ బానిస బ్రతుకులు ఎంతకాలం ఈ ఆకలి బావులు ఎన్నేళ్లు? అందుకేనమ్మా విప్లవం కావాలంటున్నాను—

మహా: ప్రజా విప్లవం కావాలి

రమ : చైతన్యం విప్లవం కావాలి.

వ : శ్రమజీవులు బ్రతుకులు బంగారుమయంచేసే ప్రజావిప్లవం కావాలమ్మా

మహా: గీతా దేశప్రగతికి ప్రయోజనానికి రాచబాట విప్లవం అందుకే...

నా కలంలో చైతన్యం పోస్తాను—

రమ : నేను నా గుండెలో—విప్లవజ్వాల వెలిగిస్తాను.

వ : ఆ జ్వాలను.... దేదీప్యమానంచేసి ఆకాశానికి ఎగురవేయండి. బానిస బంధాలలో — తరతరాల చీకటిలో — వెలుగుకోసం—వెదికే ఈ పేదప్రజల కన్నీళ్లు తుడవండి. ఈ కసాయిపాలకుల కల్మ కతాన్ని అందించడానికి—విప్లవఖడ్గం ధరించండి. గెవ్వపొంద తా

అల్లుకుపోయిన స్వార్థపు చెదారుల్ని తెగనరకండి. అప్పుడేగాంతి
అప్పుడే విముక్తి అప్పుడే శ్రమకు తగిన ఫలితం?

రమ : ప్రజావిప్లవం -

మహా: వర్థిల్లాలి.

న : ప్రజావిప్లవం -

రమ:

మహా: వర్థిల్లాలి

గీత : ముందు భోజనాలకు రండన్నయ్యా

న : పదమ్మా

రమ : దావా మూడ్‌లో అసలువిషయం చెప్పడమే మర్చిపోయాను,
ఇవ్వాలి నాకు సన్మానం మీరంతా రావాలి.

న : అఘోరించావ్లే భోంచేసివెళ్లు. (లోపికి వెళ్ళారు)

రమ : వద్దుబావా. అన్ని ఏర్పాటు అక్కడే చేశాను వస్తా. (చర చరా
బయటికి వెళ్ళాడు. మహర్షి గీత లోపికి వెళ్ళారు. తెల్లవారింది.)

# మూడవ రంగం

(అలంకరణ మొదటిరంగం మాదిరేవుంది. గీత జడ అల్లుకుంటూ బయటకొచ్చింది. అప్పుడే బయటినుండి వచ్చిన సుదర్ ఆమెను నిలువెల్లా చూస్తూ నిలబడి పోయాడు ఆమె అతన్ని అసహ్యంగా చూసి ఒక మూలకు వెళ్ళింది)

గీత. మళ్ళీ ఎందుకొచ్చావు?

సు. చెప్పానుగా వస్తానని?

గీత. దయచేసి యిక వెళ్ళు

సు. యిప్పుడేగా వచ్చింది?

గీత. చెప్పేదినీకే. మర్యాదగా వెళ్లు.

సు. (నవ్వాడు) వెళ్తాను. వచ్చినపని పూర్తికానీ.

గీత. నా మనసు పరాధీనమైంది. నేను మరొకరికి అంకితమైపోయాను. నా జీవితాన్ని పాడుచేయకు వెళ్ళు.

సు. చూడుగీతా. అందంగాపుట్టిన ప్రతి ఆడది మొదట యెగిరెగిరిపడుతుంది వెర్రెక్కిన తర్వాత పరపాలయిచి మరిగిన తర్వాత ఒడి గొదిగి వుంటుంది.

గీత. ముందు నువ్వు వెళ్తావా లేదా?

మ . నేనుచెప్పేది వార్త్రికాదు మరి.

గీత . యిక నువ్వేం చెప్పక్కరలేదు.

మ . చెప్పకపోతే నీకు అర్థం కావడంలేదుగా.

గీత . మదన్.

మ . తప్పించుకోవాలని నన్నో తప్పుడుమనిషిగా జమకట్టాలని ప్రయత్నించకు కసికసిగా మాట్లాడి నన్ను కైపెక్కించకు గీతా.

గీత . ఛీ! నీకు బుద్ధిలేదూ?

మ . యిప్పుడు తెలిసిందా నీకు?

గీత . అనవసరంగా మాట్లాడి బుద్ధి చెప్పించుకోకు

మ . నీలాటి బుద్ధిమంతురాలు యింతత్యాగానికి పూనుకుంటే నేనేం చేయగలను? రెడీ శిక్షమిదో చెప్పు కౌగిలిలో బంధించడమేనా?

గీత . కాదు — కటకటాలలో

మ . (నవ్వాడు) చూడుగీతా. నువ్వు ఆడదానివి.

గీత . ఆదిశక్తివి గూడా.

మ . అందమైనదానివి కూడా.

గీత . నీ పాపం పండేదాకా.

మ . వలపుపండే శుభసమయంలో యివేం మాటలు గీతా.

గీత . ఆడవాళ్ళంటే ఏమిటి నీకీ అలుసు?

మ . "పువ్వులన్నీ వనితలకోసం - వనితలంతా పురుషులకోసం" అని ఓ కవిరాజు గీతా చదువుకోలా?

గీత . చదివాను. నీలాంటి దుర్మార్గులకు త్వరలోనే నాశనం వుందనికూడ చదివాను.

మ . గీతా! గీత రాముడు పుట్టినప్పుడే రావణుడు పుట్టాడు.

గీత : అందుకే సీత అగ్నిలో దూకింది.

మ . ధర్మరాజు పుట్టినప్పుడు కురురాజు పుట్టాడు.

గీత. అందుకే ద్రౌపది కురులు విరబోసుకుంది.

మ. పిచ్చిగీతా నువ్వెప్పుడు బాగుపడతావు?

గి. మీలాంటి నీచుల సమాధి కట్టిన తర్వాత

మ. గీతా నా మాట విను. అనవసరంగా ఎందుకు చెడిపోతావు?

గీత. ముందిక్కడనుండి వెళ్ళిపో.

మ. చూడు గీతా పుట్టినప్పుడే భయాన్ని వదిలేసాను మంచి మానవతలు దూరం చేసుకున్నాను. వ్యక్తిత్వం వచ్చినతర్వాత నీతి- నిజాయితీలను ప్రక్కకునెట్టాను. అన్నిపోగా నాకు మిగిలింది కసి నీమీద కాదు. ఈ సమాజమ్మీద ఈ సంస్కృతిమీద. ఈ మానవమృగాలు సృష్టించిన సాంప్రదాయాల మీద అందుకే అందుకే గీతా. నిన్ను మర్యాదగా అడుగుతున్నాను.

గీత. యింతసేపు నేనూ మర్యాదగానే చెప్పాను.

మ. గీతా గుండెల్లో సుడులుతిరిగే కసిని, కన్నులలో మెరిసే కరక్కశత్వాన్ని చూసి- యీ సంఘం యింతవరకూ నోరెత్తలేదు. యే చట్టం నన్ను బెదిరించలేదు.

గీత. అందుకే బరితెగించావ్.

మ, లేదుగీతా. చెడిపోయాను పూర్తిగా అగాధంలో పడిపోయాను. యిప్పుడు నాలో న[illegible]ం లేదు ఓర్పు అంతకన్నా లేదు రా గీతా. క్షమించి - కవ్వించి నన్ను మరీ పశువునుచేయకు నవ్వుతూ రా మధువులు కురిసే ఆ లేతపెదవులు ఒకసారి నోటికందించు సిగ్గుతో ఎరుపెక్కిన గులాబీలాంటి బుగ్గల్ని - ముద్దెట్టుకోనీ - ముగ్ధుణ్నికాని, నవ్వూ మురిసి ఈ లోకాన్ని మర్చిపో హాయిగా నా ఎదలో నిదురపో రా గీతా. ఒక్కసారి (అంటూ చేయిపట్టుకుని మీదికి లాక్కున్నాడు. ఆమె విదిలించుకుని దూరంగా వెళ్ళింది)

గీత. ఛీ. నువ్వు మనిషివా? పశువ్వా?

మ. [నవ్వుదు తమాషాగా] ఆ రెండూ కాదు. త్రాగుబోతుని విస్కీ బ్రాందీ జిన్నూ రమ్మూ త్రాగినవాణ్ని మాత్రం కాదు. నీలాటి అందమైన అమ్మాయిలు అందించిన యవ్వన మధువాలు తృప్తిగా త్రాగినవార్ని. ఎం. రోకిన్యులు తమ పవిత్రమైన శీలాలు మధు కలశాలలో నింపి పెదవులకందిస్తే కడుపారా తాగి కై పెక్కి కళ్లు తిరిగి పాపపుణ్యాల ప్రస్తావన వదిలేసి విలాసాల విషాలు వీధి వీధిన తిరుగుతున్నవాణ్ని. గీతా ఒక్క నిముషం కాలాన్ని వృధా చేసుకుంటే రేపటి అనంత సాగరంలో ఒక్క మధుకణాన్ని మట్టిపాలు చేసిన వాళ్ళమౌతాం రా [అంటూ కావులించుకుని ముద్దెట్టుకునే ప్రయత్నం చేసాడు ఆ పెనుగులాటలో ఆమె తప్పుకోబోయింది కాని, అతని చేతికి ఆమె జాకెట్ వెనకభాగం దొరికింది చిరిగింది. పైటచెంగుతో ఆ లోపాన్ని కప్పుతుంది.

గీత. మదన్! నీకు దణ్ణంపెడతాను వెళ్ళిపో!

మ. దణ్ణం దేవునికిపెట్టు అందం నా కప్పగించు.

గీత. నోర్మూయ్!

మ. కోపంలోకూడా నువ్వెంత అందంగావున్నావో ఒక్కసారి నా కళ్ళలోకి చూసుకోగీతా [దగ్గరకు వెళ్ళాడు]

గీత. నీకు పుణ్యంవుంటుంది దయచేసి వెళ్ళిపో మదన్.

మ. వెళ్ళడానికే వచ్చానుగీతా.

గీత. నా బ్రతుకు నాశనం చెయ్యొద్దు వెళ్ళు.

మ. ఎవరికో ఒకరికి అర్పించవలసిందేగా నీ బ్రతుకు.

గీత. అందుకే నిన్ను వేడుకుంటున్నాను. నేనిదివరకే ఒకరికి అంకితమైపోయాను.

మ . నేను నిన్ను అంకితం కమ్మని అడగటంలేదు గీతా! ఒక్కసారి నా కోరిక తీర్చమంటున్నాను అంతే.

గీత . వీల్లేదు. మదన్! నీకు పుణ్యముంటుంది. వెళ్ళిపో.

మ . నాక్కావలసింది పుణ్యంకాదు. విరిసిన పువ్వులాంటి మనస్సు. నీ దవ్వాకావాలి.

గీత . భగవంతుడు నిన్ను క్షమించడు మదన్, క్షమించడు.

మ . అయినా, క్షమించమని అడిగేంత పాపం నేనేంచేశాను? ప్రేమించ మన్నానా? పెళ్లాడమన్నానా? అందంగా వున్నావుగనక, ఒక్క గుటక అనురాగం పంచియివ్వమన్నాను అదీతప్పని భగవంతుడు చెబితే నిజంగా ఆ దేవుణ్ని శిక్షించే అధికారం నాకుంది— నా గీతా.

గీత : వీల్లేదు.

మ , ఒక్కసారేగా—

గీత . ఒక్క నిముషంగూడా నువ్విక్కడుండటానికి వీల్లేదు. వెళ్ళు.

మ . వెళ్ళకపోతే కసితో నా బుగ్గల్ని తినేస్తావా?

గీత . మదన్.

మ . [నవ్వుతూ] చూడుగీతా. బలవంతం చేయడం నా కిష్టంలేదని ముందేచెప్పాను. ముచ్చటతీరందే, వచ్చినదారిన వెళ్ళటం, మదన్‌కు అలవాటు లేదనికూడా చెప్పానుగీతా. యిక ఏ అర్థిం పులూ నాకక్కర్లేదు. మర్యాదగా నా మాటవింటే మంచిదానివని పించుకుంటావు.

గీత . చూడుమదన్. నీకు నేనేం అపకారం చేశాను?

మద : నువ్వు కళ్ళముందు నిలబడి నవ్వుతూ, నవ్వుతూ, వుంటే మనసు లాగినంత పైకంగావుంది, అందుకే గీతా, ఈ సుఖాన్ని కాదన్న అతడి, దేశంలో యింతవరకూ లేదు గుండెలమీద నిద్రపోవటం, పెదవులతో ముద్రవేయడం చేస్తున్న ఆటలాన్ని, ఎవ్వరూ

అనలేదు. అనలేదు, నువ్వు పూర్తిగా అనుభవించలేనిదానిని ఒక
నిముషాలు కళ్లుమూసుకున్న తర్వాత, ఈ అమర సుఖం అంతు
తెలిసిన తర్వాత నే చెక్కడం, కౌగిలిలో ఒదిగి, ఒరిగిపోవడం,
అతివాక్యకు ప్రత్యేకమయిన వరదా. గీతా. రా, నమ్మి రెప్ప
గొట్టక, నిన్ను పిచ్చిగా అనుభవించే దౌర్భాగ్యం నాకు కలిగించక,
ఆనందంగా రా, హాయిగా అనుభవించు, రా. (అంటూ పై బలంగా
పట్టుకుని పైకి లాక్కున్నాడు. ఆమె చెంపమీద కొట్టింది. ఆ
దెబ్బతో అతని పట్టుదల మరీ ఎక్కువయింది. తన్నినా అరిచినా,
గావుకేకేసినా, అతనికి వినపడలేదు. బర బరా లోపలికి ఈడ్చుకు
వెళ్ళాడు చీరలాగి బయటికి విసిరేశాడు. జాకెట్, బ్రాసరీకూడా
విసిరేశాడు. అంతే. ,,ఆమె పెద్దగా అరచింది, గాజుల చిటపటలు
ఏడ్పుల కూతగులు, వినిపించాయి. క్షణం పక్కద్దాం. చొక్కా
గుండీలు పెట్టుకుంటూ, బయటికొచ్చాడు పెదాలు తుడుచుకుంటూ,
అంతకుముందు పెనుగులాటలో జారిపడిపోయిన. ఆమె తలలో
పూలచెండుమీదుగా నడిచి వెళ్ళబోయి వంగి పూలచెండు అందుకు
న్నాడు, ముద్దెట్టుకుని విసిరేశాడు, చీర జాకెట్, బ్రాసరీ నవ్వు
కుంటూ లోపలికివిసిరాడు, బయటికి వెళ్ళిపోయాడు గీతమాత్రం
వాడిన పువ్వులా బయటపడింది, గోడకు వ్రేలాడుతున్న వక్యం
ఫోటోదగ్గరకు వెళ్ళింది. పిచ్చిగా నవ్వుకుంటూ)

గీత : అయిపోయిందన్నయ్యా. అంతా అయిపోయింది. ఇన్నాళ్ళూ
కుశం కాపాడుకొంటూ వచ్చిన మానవత. ఒక్క నిముషంలో
మంటగలిసి పోయింది. ఏ ముఖం ఎలా చూపన్నయ్యా? ఎలా
జీవించను? అపవిత్రం అయిపోయిన ఈ బ్రతుకు నాకక్కరలేదు.
పాపపంకిలమయిపోయిన, ఈ పాపిష్టి శరీరాన్ని ఏ గంగలో
నయినా కలిపేస్తాను. ఈ పాపాన్ని యింతటితోనే కాల్చి బూడిద
చేస్తాను. నేను బ్రతికి భారతజాతి మహిళలకు కళంకం తెమకురా
గూడదు. ఈ భయంకర మానవ మృగాలచేతుల్లో నలిగిపోయిన

గీత . ఎలా చెప్పను? ఏమని చెప్పను మధూ?

మ . అంటే—

గీత . నేను ఆరదాన్ని మధూ! యింతకాలం పెద్దలు సృష్టించిన హద్దులమీద నిలబడ్డాను. కాని, కాలం,

మ ఏం చేసింది?

గీత . మనిద్దరిమధ్య బరిగీచింది.

మ , ఆబరి తెగించడానికే, మనకు పెళ్ళిజరగాలి గీతా.

గీత . మనపెళ్ళి, దేవుడు మనకిచ్చిన అదృష్టాలన్నిటితో పెళ్ళి అపురూపమైంది, అపూర్వమైంది మధూ? కాని, కొందరికే ఆ అవకాశం కలిసివస్తుంది.

మ . అదేమిటిగీతా. మనపెళ్ళి జరగదనే అనుమానంగా వుందా?

గీత . జరగకుండా వుంటేనే మంచిది మధూ.

మ . గీతా.

గీత . నాకు అప్పుడే పెళ్ళిచేసుకోవాలని లేదు.

మ . గీతా ఏమిటి నువ్వనేది!!

గీత . సంసారబాధ్యతలు స్వీకరించాలని నాకులేదు మధూ.

మ . ఎందుకిలా మాట్లాడుతున్నావు గీతా.

గీత . మళ్ళీ మళ్ళీ నాచేత ఎందుకుచెప్పించాలని ప్రయత్నిస్తావు మధూ.

మ . మరి నన్నెందుకిలా చేశావు?

గీత . నేనెందుకిలా అయ్యానో – నీకేం తెలుసు?

మ . నన్ను ప్రేమించినట్లు నటించావన్నమాట?

గీత . నటించడానికి ప్రేమించవలసిన అవసరం లేదు మధూ.

మ . పెళ్ళి చేసుకుందామని – చేతిలో చేయి వేయలేదా నువ్వు?

గీత . ఎదలో ఎదనుకూడా కలిపాను.

మ . ప్రేమపేరుతో వలపు ఊయల వూగించలేదా నన్ను?

గీత : ఊహలతో పొదరింటిలో యిద్దరమూ పొంగిపొర్లినవాళ్ళం నిజమే
మధూ.

మ . మరి ఎందుకిలా మారిపోయావు?

గీత : యిప్పుడు నేనేం చెప్పలేను మధూ.

మ : మనసెళ్ళకి మాత్రం అభ్యంతరం చెప్పకుగీతా.

గీత : అలా జరగడానికి వీల్లేదు మధూ!

మ . ప్రేమించినట్లు నమ్మించి- నటించి - నన్నెందుకు నవ్వులపాలు
చేశావు. నేనేం పాపం చేశాను?

గీత . మధూ మధూ.

మ . చెప్పుగీతా. నా గుండెల్ని అగ్నిగుండాలుగా మార్చాలని ఎందుకు
ప్రయత్నిస్తున్నావు? నన్ను కావాలనుకునే దానివైతే ఈ ఒక్క
నిజంచెప్పు గీతా.

గీత . ఏమిచెప్పలేని నిస్సహాయస్థితిలో వున్నాను మధు. నన్నేమీ,
అడక్కు - దయచేసి వెళ్ళిపో.

మ : గీతా!

గీత . వెళ్ళుమధూ. నామీద ఏమాత్రం గౌరవమున్నా. వెంటనే వెళ్ళిపో

మ . అలాగేగీతా కాని ... ఒక్కటిమాత్రం చెప్పివెళ్తాను.

గీత . ఏమిటి?

మ . నిన్ను మొదటిసారిగా చూసినప్పుడు నా హృదయాన్ని దోచు
కున్నావు కాదుగీతా పగలగొట్టుకున్నావు. ఆశల చిగుళ్ళను తెం
చుతూ నరికివేస్తున్నావు.

గీత . మధూ.

మ . చూడుగీతా, ఎప్పుడొచ్చినా - నవ్వుతూ నవ్విస్తూ నన్ను ఏలోకి
ఆహ్వానించేదానివి. "నన్ను స్వర్గానికి తీసుకువెళ్ళుగీతా" అనగానే
మధురంగా పాడేదానివి. ఆ పాటలోనే లోకాన్ని. జీవితాన్ని

యింతకాలం మర్చిపోయాను. మధురాను మన్నిస్తున్నయ్యాను కాని,
గీతా విధి ఎదురుదెబ్బ తీసిందని నా హృదయం గాయంచేశావు,

గీత . నా గుండెలో రగులుతున్న అగ్నిగురించి నేనెవరికి చెప్పుకోను మధూ ఎలా చెప్పుకోను.

మ . పోనీ ... ఒకపాట అయినా పాడగలవా?

గీత . జీవితం విషాదం అయిందని ఎలాపాడను మధూ.

మ . నేను వెళ్ళడానికైనా నువ్వుపాడాలిగా గీతా.

గీత . మధూ!

మ . నీతో స్నేహం చేసిన నేరానికి ఆఖరిసారిగా ఒక్కపాట అయినా వినిపించలేవా గీతా?

గీత : పాడతాను మధు నీ కోసం ఆఖరిగీతం పాడతాను. (అంటూ విషాదంగా పాడుతుంటూ ఓ ప్రక్కకువెళ్ళింది మధు తప్పట్లుకొట్టబోయి ఆగాడు)

మ . క్షమించుగీతా. జీవంలేని నవ్వులూ తాళంలేనిచప్పట్లు నిన్ను బాధపడితే క్షమించు వస్తా. (వెళ్ళబోయాడు)

గీత : మధూ

మ : యింకేం కావాలిగీతా?

గీత . చిన్న సహాయం చేయగలవా?

మ . (పెదాలమీద నవ్వాడు విరాళగా) అదేమిటిగీతా. అడగకపోయినా మనసిచ్చాను నీకు ఇష్టంగా తృప్తిగా వున్నంతసేపు దాన్ని నీ దగ్గరే వుంచుకుని విసుగేసి వినరి వీధిలోపడేసినా విరిచిముక్కలు చేసినా నిన్ను యేమన్నానా? చెప్పుగీతా ఏం కావాలి?

గీత , నన్ను నీచంగా చిత్రించకు మధూ.

మ . విచిత్రంగా ఆడుకుంటున్న ఆ భగవంతుడ్ని ఎలా ప్రశ్నించాలో అర్థంగాని నాకు నిన్నెలా చిత్రించమంటావు గీతా?

గీత . మధూ.

మ. • సత్యాగితా. నీ మనసు తేలికయినప్పుడు - గుండెలు పొంగిపోతు  న్నప్పుడు - సత్యను గుర్తుచేసుకో. అప్పటిదాకా నీ కోసమే ఎదురుచూస్తూ వుంటాను. (వెళ్ళిపోయాడు)

గీత : మమా [అంటూ సత్యంఫోటో దగ్గరకు వెళ్ళింది. ఏడుస్తూ] అన్నయ్యా నన్ను కళామూర్తిని చేసిన ఆదర్శమూర్తి వెళ్ళి పోయాడన్నయ్యా. చీకటి కడుపున ఆదవిజ్యోతి వెలిగించాలని తపించీ- తపించీ నా జీవితంలో వెలిగిన మహత్తర కళాతేజం ఒక్క నిముషంలో ఆరిపోయిందన్నయ్యా. ఆరిపోయింది! ఏడుస్తూ లోపిక వెళ్ళబోయింది - బయటనుండి రమణ మహర్షి వచ్చారు]

మహా. మళ్ళీ ఏడుస్తున్నావా గీతా?

గీత : లేదుబావా నేనెందుకేడుస్తాను?

మ . చూడుగీతా. సత్యం వెలిగించిన సమిధలం మేము. ఈ చిన్నిసమి ధలు సమరజ్వాలలై స్వార్థపరుల హృదయంలో చిట్టెపురాళ్ళుగా మారిన గుండెల్ని కాల్చివేసి మహోజ్వల జ్వాలలుగా మారడానికి నీ కన్నీరు చమురుగా పోశారు. త్యాగాన్ని వహానాన్ని పోసి సమసమాజ నిర్మాణానికి సిమైక్యతా పునాదులు కట్టడానికి మా యిద్దర్నీ వెలిగించు గీతా.

గీత . నేనే చీకటిగా మిగిలిపోయాను బావా.

ర . చీకటిని చీల్చడానికి స్వార్థాన్ని కూల్చడానికి మేమున్నాంగీతా, సత్యం జీవించాలి

గీత . అంటే.... అన్నయ్య కేమైనా....

మ . విప్లవజ్వాల ఆరడానికి వీల్లేదుగీతా.

గీత . అంటే....

ర . మహోగ్రరూపం దాల్చిన మానవతాజ్వాల యీ దేశ శనానికి పూనుకున్న స్వార్థాన్ని మసిచేయాలి. చట్టాన్ని - శాసనాన్ని

పెద్దరికం పేరుతో పెత్తన్న దారులతో బిగించిన అధికారం అంతః రాంతరాల్లో చేరి- చైతన్యం వెలిగించాలి, అనంత అత్యాంతరాల్లో ప్రచండజ్వాలగా ప్రతిఫలించాలి.

గీత. ఏమాటలు నా కర్థంగావడం లేదు బావా?

మ. మనసత్యం అనంత విప్లవయజ్ఞానికి మహోగ్రరూపం ధరించాడు.

గీత. అధికారం కళ్ళుతెరిస్తే-

ర. అవును గీతా. అధికారం కళ్ళుతెరిస్తే.... సరియైనప్రశ్న. మహర్షి నేను వెదుకుతున్నాను. [రెండడుగులు వేసాడు]

మ. ఒరేయ్, ఎక్కడికి?

రమ. మూడ్ లోకి వెళ్ళి సమాధానం వెతకుతాను (ఆలోచించాడు) ఆ... వచ్చినది మహర్షి గీతవేసిన ప్రశ్నకు సరియైన సమాధానం వచ్చినది. ఈ దేశంలో అధికారం కళ్ళుమూసి - యెన్నోఏళ్ళు గతించినవి.

మ. అందుకే రమణా! ఎన్నోఏండ్లు గతించినవి- కానీ శ్మశానస్థలిన్. కనుల్ మోడ్చిన మందభాగ్యులందు ఒక్కండును తిరిగి లేచి రాడిక అన్నాడు విశ్వకవి జాషువా!

రమ. శాశ్వతంగా కనులుమూసినవారిని ఉద్దేశించి అన్నమాటలివి. కాని- వీళ్ళు? పెత్తందారులు.... నాయకత్వానికి గుప్పెట్లో బిగించి అంద లాలమీద దొర్లుతున్న అధికార దురంధరులు. పదవులు పట్టుకొని తరతరాలుగా వ్రేలాడుతున్న మహా మంత్రగాళ్ళు గాఢనిద్రలో మునిగిపోయారు, వీళ్ళనులేపడానికి, ఎన్ని వేలకంఠాలు దిక్కులు పిక్కటిలేలా అరచినా- లేవనే లేవరు-

మహ. గీతా వాళ్ళను లేపడానికి ఒక్కటే ఆయుధం,

రమ. అదే విప్లవజ్వాల, ఆ జ్వాలను చైతన్యంతో రగిలించి. గుండెల లోతులలో అంటుకుపోయేలా మందవేస్తేనేగాని .. కనీసన్యాయం జరగదు గీతా,

గీత : మీకోసం కాచుకొనేదెవరో కూడా తెలుసా బావా?

రమ . ఎర్రటోపీలూ, బుర్రమీసాలూ, తుపాకులూ, తూటాలు.

గీత . మీకిచ్చే బహుమానం కూడా తెలుసుగా–

మహ, తెలీకేం; సంకెళ్ళు. జైళ్ళు.

గీత . యిన్ని తెలిసి యెందుకిలా తయారయ్యారు

రమ . అవమానము క్షమించరాని మహాపరాధము. సత్యానికి నయాము సహోదరిపై చైతన్యస్రవంతిపై । పిరికిని మాలో ప్రవహింప జేయాలని ప్రయత్నం చేస్తున్న నీ అసహాయత సహించరానిది గీతా.

గీత . బావా.

మహ. అవునుగీతా. మన భవిష్యత్తును బంగారం చేసుకోవడం.... మన వంతు కర్తవ్యంకాదా చెప్పు.

గీత . విప్పును ముట్టుకుంటే నీవేమే కాలుతుందిబావా. (యింతలో బయటనుండి సత్యం వచ్చాడు)

స . ఏమిట్రా మీటింగ్?

రమ . అట్టే ఏంలేదు బావా. చచ్చినవాళ్ళను లేపడానికి మందులున్నా యేమోగాని, ఈ బతికిచచ్చినవాళ్ళను మేల్కొలపడానికి ఎన్ని గొంతులు కావాలి అంటున్నాను అంతే.

స . ఏమ్మాగీతా. ఏమిటలా వున్నావు?

గీత. ఏం లేదన్నయ్యా? బావా చెవుతున్నాను.

స : నాకు తెలుసమ్మా? వ్యక్తిత్వాన్ని వెదుక్కుంటూ వెళుతున్న విప్లవ త్తునుగురించి నువ్వెంత కృంగిపోతున్నావో నాకు తెలుసు.

గీత . అన్నయ్యా,

స . అవునమ్మా. యికనేను మీతో కలిసి, ఆనందాన్ని పంచుకునే అంత కాలంలేదమ్మా.

గీత . ఏమిటన్నయ్యా నువ్వనేది?

త . ఏం జరిగింది బావా?

మ . ఏవరయినా వెదకుతున్నారా బావా?

న . చట్టమే వెదకుతుంది మహర్షి?

గీత. అన్నయ్యా?

న . అవునమ్మా? చట్టానికి లొంగిపోయి కర్తవ్యాలకి ద్రోహం చేయ
లేను.

రమ: మరేంచేస్తావ్ బావా?

న . మీ అందరికీ కొన్నాళ్ళు దూరంగా వెళ్ళిపోతాను.

గీత . అన్నయ్యా

న , నేను పారిపోవడంలేదమ్మా? యిన్నాళ్లు నన్ను నమ్ముకున్న
మిత్రులి, కాపాడటానికి, నేను నమ్ముకున్న సిద్ధాంతాన్ని రక్షిం
చడానికి వెళ్ళకతప్పదు.

గీత . సమసమాజ స్థాపనకోసం –అర్పణచేసిన ప్రతిఅణువూ శరీరంలో
ప్రవహించే ప్రతినెత్తురుబొట్టుకూ ఫలితం యిదా అన్నయ్యా.

న . గీతా.

రమ. యుగయుగాల దోపిడిలో మిగిలిన తరతరాల చీకటిని చీల్చడానికి
చేపట్టిన విప్లవజ్వాల అడవుల్లో వెలిగిస్తావా బావా?

న . లేదు రమణా, ఈజ్వాల ఆరేదికాదు– యిది మనం వెలిగిస్తే వెలి
గేదికాదు. అందరూకలిసి– చైతన్యంపోసి వెలిగించే మహోజ్వల
జ్వాల – ఎన్నటికీ ఎడారులపాలు కాకూడదు. అసలు ప్రతి
మనిషిలోనూ ఒకజ్వాల రగలాలి. ప్రతి గుండె అగ్నిగుండంగా
మారాలి. ప్రతిచేయి ఆకాశాన్నంటే ఎర్రకాగడా కావాలి.
అంతే రమణా, అంతే:

గీత , అయితే ... నేను... నేను ....

మ రా. మేమున్నాం గీతా. నీ భవిష్యత్తును తీర్చిదిద్దడానికి ప్రాణాలైనా
అర్పిస్తాం.

న . చూడమ్మా నాలాంటి అన్నయ్యలు యింకెంతమంది తల్లులి—

పిల్లల్ని - చెల్లెళ్ళను వదిలేసి - ఏమరణ్యాలలో పోతున్నారో —
మీకు తెలీదు గీతా.

గీత . అన్నయ్యా.

స . అవునమ్మా సత్యానికి భాగస్తులైన వాళ్ళంతా చట్టానికి నేరస్తులుగా కనిపిస్తారు త్యాగానికి వారసులయిన వాళ్ళంతా - స్వార్థానికి బలి కాక తప్పదు, రమణా. మహర్షి నీకు బావేకాదు. యికనుండి వివాహమైన అన్నయ్యలు కూడ. సత్యం బ్రతికినంతకాలం సంస్కృతికి ఏ లోపం రాదు గీతా.

గీత . అయ్యో భగవాన్ [అనగానే బాయట విజిల్ వినిపించాయి రమణ, మహర్షి వాకిలిదాకా వెళ్ళి చూసివచ్చారు]
స . కర్తవ్యం పిలుస్తోంది గీతా, వస్తా [వెళ్ళబోతాడు]
గీత . అన్నయ్యా,

రమ . బావా సమాజవికాసానికి పూనుకున్న కర్తవ్యంకన్నా గీత భవిష్యత్తు బాగుచేయడం మా లక్ష్యం. నిశ్చింతగా వుండు బావా.
స . వస్తానమ్మా (వెళ్ళబోయాడు]
గీత . అన్నయ్యా అన్నయ్య....

స . కర్తవ్యాన్ని కట్టవే దానికి కన్నీళ్ళు చాలవమ్మా. అభ్యుదయానికి అంతస్తులు నిర్మించడానికి మనమంతా పునాదులు వేయాలి. లేకపోతే ఈ దేశం బాగుపడదు గీతా. అందుకే నేను వెళ్ళాలి వస్తా [అంటూ గబగబా బయటికి వెళ్ళిపోయాడు]
గీత . అన్నయ్యా [బావురుమంది]

రమ. యిప్పుడు ఏడ్వటానికి సమయంకాదు గీతా,
గీత నాకు మిగిలిందే ఏడుపు బావా.
మహ. ఏడుపు కొందరి ఆ వాళ్ళకు ప్రత్యేకంగా భగవంతుడు ప్రసాదిస్తాడు గీతా. అందుకే నీ చీకటి జీవితాన్ని వెలిగిస్తాం.
గీత . నాకు అదృష్టం లేదు బావా.

మహా. అదేమిటి గీతా.

గీత . నేను అందరిలా పుట్టలేదు అగ్నిపరీక్షల్లో పుట్టాను చిన్నప్పుడే తల్లిని పోగొట్టుకున్నాను. బిట్టకష్టడు నేర్చినతర్వాత - తండ్రిని దూరం చేసుకున్నాను. కంటికిరెప్పలా కాపాడిన అన్నయ్య .... యిప్పుడు వెళ్ళిపోతాడు యిక నేనెవరికోసం బ్రతకాలి? ఎందుకు బ్రతకాలి?

రమ . చూడు గీతా, చాపు కూడా అందరికీ అనుకున్నప్పుడూ కోరుకున్నప్పుడూ రాదమ్మా. మధు యెక్కడున్నాడో చెప్పు - అతనితో మాట్లాడి పెళ్ళి జరిపిస్తాం.

గీత . ఈ పెళ్ళి జరగదు బావా

రమ . గీతా.

గీత . జరగడానికి వీలులేదు.

మహా. యెందుకని గీతా?

గీతా : కారణం చెప్పడానికూడా నోరు కట్టుబడిపోయింది బావా నన్నేమీ అడగొద్దు,

రమ : గీతా నీకు మేము పరాయివాళ్ళం కాదు,

మహా: నీ కోసం ఏంచేయడానికైనా సిద్ధంగా వున్నాం గీతా, కట్నాలూ కానుకలూ కావలసివస్తే...నా భాగం ఆస్తివుంది. అమ్మి .. లక్షణంగా పెళ్ళి జరిపిస్తాం గీతా.

గీత : వద్దు బావా. మీరంతా త్యాగానికి పూనుకుని ఆత్మీయత మంచితనంతో కట్టిపడెయ్యవద్దు. మీకు దణ్ణం పెడతాను దయచేసి నన్నేమీ అడక్కండి బావా! అంటూ లోనికి వెళ్ళింది ఏడుస్తూ)

రమ : మ ర్షి గీత ఏడుస్తుంది మదు మోసం చేయలేదుకదా.

మహా: ప్రేమించిన విడిపోయారంటే అంతకిపి మరొకటి వుండదు. అసలా ప్రేమనుండి విడిపోవాలంటే పెద్ద భూకంపం రావాలి.

రమ : మరి గీత ఎందుకిలా మారింది?

మహా: పద తెలుసుకుందాం. (లోనికి వెళ్ళారు. తెరపడింది)

# నాలుగవ రంగం

[కరుణాకరంగారి రెండంతస్తులమేడ అందంగా ఆధునాతనంగా వుంది ముందుహాలో ఖరీదైన ఫర్నిచర్ వుంది డ్రాయర్ మీద పుస్తకాల దొంతర పూలకుండీ - ఫోను. ప్యానో వగైరా వున్నాయి. సిల్కు డోర్ కర్టన్స్ వాకిళ్ళకు వ్రేలాడుతున్నాయి, రెండు వాకిళ్ళ మధ్యభాగంలో రేడియోస్టాండ్ వుంది. గోడలకు దేశనాయకుల ఫొటోలు ప్రకృతి చిత్రాలు తగిలించినారు - గోడ గడియారం రాత్రి ఎనిమిది గంటలు మ్రోగింది. రత్నాలు లోపల్నుండి వచ్చి ఫర్నిచర్ శుభ్రంగా తుడిచి రేడియో ఆన్ చేశాడు రేడియోలో చక్కని సినిమాపాట వచ్చింది- ఇంతలో మేడదిగి గీత ముందుహాలో కొచ్చింది- రేడియో ఆపుచేసి ఓ కుర్చీలో కూర్చుని వీక్లి తిరగవేస్తూంది. రత్నాలు ఆమెను పలకరించాలని ప్రయత్నం చేశాడు]

రతా : అమ్మాయిగారూ

గీత : (తలెత్తి చూసింది)

రతా ; నా పేరు రత్నాలండి.

గీత : తెలుసు.

రతా : నేనీయింట్లో పనివాణ్ని-

గీత : అదీ తెలుసు.

రతా : మీరీయింటికి రాకపూర్వం.... అయ్యగారికి....నేనే అమ్మాయి గారూ.

గీత : (చూసి ఏమీ అనలేకపోయింది)

రతా : చూడండి అమ్మాయిగారూ

గీత : నువ్వయితే పనివాడివి. పసివాడివి,... అంతేకాదు... అయ్యగారి మంచి చెడ్డలు చూడ్డానికి నీకన్నా-ఎవ్వరూ లేరు- అంతేగా?

రత్నా : మీకు కోపం వచ్చినట్లుంది?

గీత : లేదు రత్నాలు. లేదు.

రత్నా : ఎంత చల్లగా పిలిచారమ్మాయిగారూ నిజంగా మీ పిలుపులో ఎంత తీయదనం - ఎంత కమ్మదనం వుందో చెప్పడం చాలా కష్టం అమ్మాయిగారూ.

గీత : నువ్వు చదువుకున్నావా రత్నాలూ?

రత్నా : చదివానులెండి ఉద్యోగం చేయడానికి పనికొస్తుం దనుకున్నాను కాని వూడిగం చేయడానికి వుపయోగపడింది. అయినా అమ్మాయి గారూ ఈ రోజులలో డిగ్రీ సంపాదించినా లాభం లేదులెండి.

గీత : ఇంతకీ నువ్వు చెప్పేదేమిటి?

రత్నా : అయ్యగారికి నేనంటే చాలాయిష్టం అమ్మాయిగారూ,

గీత : ఆయన చాల మంచివారు

రత్నా : కాదమ్మాయిగారూ, మంచి హృదయం గలవారు. గుండెలనిండా ఆత్మీయత నిండినవారు

గీత : అవును

రత్నా : మిమ్మల్ని చూస్తుంటే నాకేమనిపిస్తుందో తెలుసా అమ్మాయి గారూ.

గీత : చెప్పకుండా ఎలా తెలుస్తుంది?

రత్నా : చెబితే అర్థం చేసుకోవడంలో అర్థం లేదమ్మాయిగారూ.

గీత : రత్నాలూ

రత్నా : మళ్ళీ పిలవండమ్మాయిగారూ.

గీత : నీకెవరూ లేరా?

రత్నా : ఇప్పుడెవరూ లేరండీ, కాని ఆ పిలుపులో దూరం అయిపోయిన నా చెల్లిగొంతు విన్పిస్తోంది నా చెల్లి అచ్చం మీలాగె వుండేది.

గిత : ఇప్పుడెక్కడుంది?

రతా : మనకు చాలా దూరంలో పిలిస్తే వినపడనంత దూరంలో వుందమ్మాయి గారూ.

గిత : అంటే, ఆమె...

రతా : చనిపోయిందమ్మాయిగారూ.

గిత : రత్నాలూ.

రతా : అమ్మాయిగారూ ఆమె పేరేమిటో తెలుసామీకు? ప్రగతి బాగుంది కదండీ.

గిత : ప్రగతి, చాలా బాగుంది

రతా : అప్పుడమ్మాయిగారూ, ప్రగతి చాలా బాగుండేది. కాని, కాని, ప్రగతిని, : మావూరి పెద్దమనిషి అంటే మా సమితికి ప్రెసిడెంటు—

గిత : ఏం చేశాడు?

రతా : ఈ దేశంలో నాయకత్వం చేపట్టిన స్వార్థపరులు. ప్రగతిని ఏం చేస్తారో తెలీదా అమ్మాయిగారూ. ప్రగతి పంతులమ్మగా పని చేస్తుండేది. పదినెలలు పనిచేసినా, జీతం యివ్వని అధికారాన్ని కోపగించుకుంది, ప్రగతి నోరెత్తిందనే కోపంతో, సమితి ప్రెసిడెంటు ప్రగతిని ఒంటరిగా చూశాడు. అధికార గర్వంతో అహంకారపు ఎత్తుగడలతో, స్వార్థం పెచ్చరిల్లిన కళ్ళతో ప్రగతిని చెరిచాడు అమ్మాయిగారూ, మానభంగం చేశాడు.

రతా : అవును రత్నాలూ. పదవుల మత్తులో, ప్రగతిని మాసి వోర్వలేక పోయి వుంటాడు

రతా : అవును. నా ప్రగతి ఏంచేసిందో తెలుసా?

గిత : తెలుసు రత్నాలూ, ఆత్మహత్య చేసుకుంది, ప్రగతి ఆత్మహత్య చేసుకొంది అంతేగా—

రతా : అప్పుడే అమ్మాయిగారూ. నా ప్రగతి నన్ను దగ్గరకు పిలిచింది.

"ఒరేయ్ అన్నయ్యా నేను చదివిపోతున్నాను. ఈ నాయకుల చేతులలో నీ ప్రగతి నాశనమై పోయింది కులంపోయిన ప్రగతి జీవించలేదు ప్రగతికోసం నువ్వెంత ఏడ్చినా లాభంలేదురా" అంటూ కన్నుమూసిందమ్మాయిగారూ.

గిత : నీ కెంత అన్యాయం జరిగింది రత్నాలూ.

రత్నా : అయినా నాకేం ఫర్వాలేదమ్మాయిగారూ ఇప్పుడు మీరున్నారుగా నా ప్రగతిని మీలో చూసుకుంటూ హాయిగా కాలం గడుపుతాను నా చెలిని మీ కళ్ళలో చూసుకుంటూ తృప్తిగా జీవిస్తానమ్మాయి గారూ.

గిత : అలాగే రత్నాలూ. అలాగే-

రత్నా : (కళ్ళుతుడుచుకున్నాడు) ఇప్పుడు చెప్పండమ్మాయిగారూ మీరీ యింటి యజమానులు నేనీయింటి పనివాణ్ని. నన్నేం చేయమం టారు?

గిత : ఏమీ చెయ్యొద్దు రత్నాలూ. నవ్వుతూ. నవ్విస్తూ వుంటే చాలు——

రత్నా : అదేమిటమ్మాయిగారూ అయ్యగారూ అంతే అసలు నేనీయింట్లో వుంది ... (ఇంతలో కిరుణాకరు మేడదిగి హాలోకొచ్చారు)

కరు : మమ్మల్ని నవ్వించడానికి నవ్వులతోటలో నడిపించడానికి [గిత ఓ ప్రక్కకు వెళ్ళింది సిగ్గుగా]

రత్నా : బాబుగారూ.

కరు : విన్నావుగా గితా ఇన్నాళ్ళూ గుండెలనిండా విషాదాన్ని. కన్నుల నిండా నిశీధాన్ని-ఈ అమాయకుని నవ్వులతోనే వెలిగించాను. అరదిక్కులేని నాకు. దీపం వెలిగించే భాగ్యం కరువైన యీ మేడకూ, అదేజ్యోతిగా మిగిలిపోయాడు. ఇప్పుడు నీ రాకవలన, చీకటి విడిపోయింది, శూన్యమయమైన నా హృదయంలో వెన్నెల నిండిపోయింది, ఇదంతా నా అదృష్టం గితా।

గిత : లేదండీ ఇదంతా నా అదృష్టం, జీవితంలో ఎన్నడూ వూహించని

కలలు, నన్ను స్వర్గసోపానాలమీదినుంచి ఆకాశమంత, అంతస్తులో ప్రతిష్ఠింపచేశాయి, నేనే అదృష్టవంతురాలిని-

కరు . గీతా!

ర : బాబుగారూ?

కరు . ఏమిట్రా?

ర . అమ్మగారిని చూస్తుంటే చనిపోయిన లక్ష్మీదేవిగారు మళ్ళీ మనింట్లో తారాడినట్లుంది గదండీ!

కరు . (గీతను నింపాదిగా చూశాడు) అవున్రా? నిజం చెప్పావు! లక్ష్మి అందులు ఘల్లు ఘల్లుమని మోగిన మనింట్లో ఇప్పుడు గీత కాలి మెట్టెలు చప్పుడు చేస్తున్నాయ్. ఇంతకాలం బ్రతుకుమీదరోత, జీవితమ్మీద అసహ్యం పుట్టిన నాలో గీత క్రొత్త ఆశలు చిగురింప జేసింది. ఒరేయ్ ఏనాడో చేసుకున్న పుణ్యంకొద్దీ మళ్ళీ మనింట్లో లక్ష్మీదేవి వెలిసిందిరా.

గీత, ఎందుకండీ...నన్నిలా పొగుడుతారు?

కరు . ఇది పొగడ్త కాదు గీతా! ఆస్తికీ ఆడంబరాలకూ తిరుగులేని వంశం మాది విలాసాలకూ వినోదాలకూ అంతులేని కుటుంబంకూడా. అయినా లక్ష్మి కన్నుమూసిన తోడువలన జీవితంలో అన్ని ఆశలూ అనురాగాలూ కూడా కన్ను మూశాయ్. నువ్వొచ్చిన తర్వాత మళ్ళీ నవ్యకాంతులు వెల్లివిరిశాయి నయనాల్లో ఎన్నో ఆశలు మెరిశాయి

ర . బాబుగారూ! తమరేమీ అనుకోనంటే ఒక్క మాట అడుగుతాను

కరు , అడుగు రత్నాలూ! ఒకటేమిటి? వంద అడుగు ఇన్నేళ్లూ నాయింట్లో పనివాడివి నువ్వే అయానవు. నవ్వుల దివ్వెగా వెలిగిన పువ్వుగా మనీ యింట్లోవుండి నన్ను బ్రతికించావ్. మళ్ళీ బ్రతికిచ్చావు. ఎన్నయినా అడుగు రత్నాలూ!

ర . ఏం లేదు బాబుగారూ! అమ్మగారు లేనిలోటు తీరిందిగా

కరు . ఏం చేయమంటావో చెప్పు-

ర . చినబాబును యింటికి తీసుకురండి బాబూ; అమ్మగారే స్వయంగా చూసుకుంటారు

శరు . ఆత్రపత్నం విన్నానే దేశాను రత్నాలూ.

ర . బాబుగారూ.

శరు . చినబాబు యీరోజు యింటికొస్తున్నాడు

ర . అమృతం తాగినంత తీయని కబురు చెప్పారు బాబుగారూ. ఇక మనింట్లో ఏకొరతా వుండదు బాబూ, అలా బయటికి వెళ్ళొస్తాను.

శరు . వెళ్ళిరా బిడ్డల కోర్కె తీర్చలేని తండ్రి తండ్రికాదురా జన్మ నిచ్చిన భగవంతుడే నన్ను మర్చిపోయాడు. జీవితాన్ని కసి కొద్దీ చీకటిలోకి నెట్టివేశాడు. విధికూడా పగతో నన్ను వక్రదారి పట్టిం చింది నువ్వేనాకు రెండుకళ్ళయి రెండో పెళ్ళిచేసి శూన్యమయ మైన నా హృదయాన్ని యీ యింటిని దేవాలయం చేశావు. వెళ్ళు రత్నాలూ, వెళ్ళు.... ఇదిగో డబ్బు (అంటూ పర్సుతీసి పదిరూ పాయలనోటు యిచ్చాడు)

ర . బాబుగారూ,

శరు . ఇంకో పది కావాలా రత్నాలూ.

ర . అక్కర్లేదు బాబుగారూ. ఎప్పుడూ మీదయవుండాలేగాని యీ పదులూ పాతికలూ నాకెందుకు; డబ్బుకన్నా విలువైనా మీ ఆత్మీ యత చెరిగిపోకుండా కరిగిపోకుండా వుంటే చాలు బాబూ అదేపది వేలు.

శరు . ఒరేయ్. చేసినమేలు మర్చిపోయేంత కృతఘ్నుణ్ని కానురా నేను. వెళ్ళు (రత్నాలు నమస్కరించి బయటికి వెళ్ళాడు) నమస్తే క్షమి స్తావా గీతా

గీతా . అంతమాట అనకండి.

శరు . ఇన్ని సంవత్సరాలూ సంస్కృతివున్నా నన్ను వెలుగు లోనికి నడి పించే యిల్లాలు పోయిన తర్వాత నేనేమీలేనివాణ్నయ్యాను. చిన తనం చినబాబుకూడా యిల్లు విడిచి వెళ్ళాడు. తిరిగి వస్తాడనే ఆశ..

నన్ను గిలి పోయింది. కాని గీతా, మన పెళ్ళి జరిగిన మరునాటి రోజే వచ్చాడు గీతా.

గీత : ఈ విషయం ముందుగా నాతో ఎందుకు చెప్పలేదండి?

శరు . నేను చేసిన మొదటి పొరపాటు అదే గీతా. చెప్ప డానికి నోరు రాలేదు అయినా నేను పెళ్ళి చేసుకుంది .. నాకో యిల్లాలు కావాలని మాత్రం కాదు గీతా, ఈ యింట్లో జ్యోతి కావాలని — ఇందులో నా తప్పేమన్నా వుంటే-క్షమించు.

గీతా . అంతమాట ఎందుకులెండి.

శరు . జీవితంలో అన్ని సుఖాలు అనుభవించిన నేను-ఏ సుఖానికి నోచుకోని నన్ను-నా యింటికి యిల్లాలుగా - ఒక తల్లిగా తీసుకొచ్చాను. వయసు రావక ముందే లక్ష్మి చనిపోయింది- ఉద్యోగస్తా దని ఆశపడిన కొడుకు వూరు విడిచివెళ్ళి- రావడం మానేశాడు. ఇప్పుడు...నేను దారితప్పాను. ఒక్కసారి కాలుజారితే- తిరిగి తీసుకోలేనంత అవినీతి బురదలో కూరుకుపోయాను. అప్పుడే... నువ్వు నా కారు క్రిందపడబోవడం నిన్ను యింటికి తీసుకు రావడం జరిగింది—నువ్వీ యింట్లో అడుగుబెట్టగానే జ్యోతి వెలిగినంత పనయింది ఆ వెలుగు శాశ్వతంగా వుండాలనే నీ మెళ్ళో తాళి గట్టాను గీతా, ఇల్లు విడిచివెళ్ళిన నా బాబుకూడా-నీ రాకతో యింటికి చేరాడు నిజంగా నువ్వు దేవతవు గీతా.

గీత . ఎందుకండీ నన్నలా పొగిడేస్తారు?

శరు , నిజం గీతా, ఇందులో నా తప్పేమిటి? నేనెవరికి అన్యాయం చేశాను?

గీత లేదండీ మీరు..ఎవరికీ ఎప్పుడూ అన్యాయం చేయలేదు. ఎడారిలో ఏ సుడిగాలికో రాలి, ఎండిపోతున్న ఓ గులాబీని చిగురింపజేశారు కొత్త చిగుళ్ళు మొలిపించారు. ఇందులో మీ తప్పేమీ లేదండి.

రఘు . చూడు గీతా! పాతికేళ్ళు న్యాయవాదిగా బాధ్యతకు నేనెప్పుడూ అన్యాయం చెయలేరు. తప్పులు చేసిన వాళ్ళకూ తప్పుడు సాక్ష్యాలతో ఉరికంబాలకు ఎక్కవలసిన వాళ్ళకు శిక్షకు బదులు, నా శక్తి మేరకు న్యాయం వంచిపెట్టాను కాని...దేవుడే నాకు అన్యాయం చేశాడు. న్యాయాన్ని రక్షించడానికి- ధర్మాన్ని తూకం వెయ్యడానికి అనేకసార్లు నన్ను జీవిత పోరాటంలో ఓడిపోయేలా చేశాడు గీతా!

గీత . లేదండీ! న్యాయం ఎప్పుడూ ఎక్కడా ఓడిపోలేదు. న్యాయానికి ఓటమే జరిగితే ఈలోకమే చీకటైపోతుంది.

రఘు . గీతా. పెళ్ళి చేసుకోవాలని గుండె పగుళ్లయే కొత్తదిగుళ్ళు మొలకెత్తాని నేనెప్పుడూ అశించలేదు కాని.. గీతా! నిన్న మొన్నటి వరకు నా కనీసయోగక్షేమాలయినా- పట్టించుకోని నా చిన బాబు ఒక్కరోజు ముందు వచ్చివుంటే నేనే పరీక్షలోనూ ఓడిపోయే వాణ్ని కాదుగీతా

గీత . అన్నీ మనం ఆలోచించినట్లు జరిగితే యిక ఆ దేవుడితో పనేముంటుంది చెప్పండి! అందుకే.. అప్పుడప్పుడూ... న్యాయానికి చిన్న చిన్న పరీక్షలు పెడుతూ వుంటాడు అంతమాత్రాన మనం ఓడిపోయినా న్యాయం ఓడిపోదండీ ఓడిపోగూడదు, ఓడిపోవడానికి వీల్లేదది కూడా. ముందు మీ రెళ్ళి చిన బాబును యింటికి తీసుకురండి.

రఘు . అలాగే గీతా. నువ్వు బాబుకోసం స్వీట్లు తయారుచెయ్యి. వాడికి తీపిఅంటే చాలాయిష్టం. వస్తా (అంటూ బయటికివెళ్ళారు గీత విట్టూర్పు లోనికివెళ్ళింది. క్షణంనిశ్శబ్దం బయట కారుహారన్ మ్రోగింది. మధు డ్రైవర్ సహాయంతో ముందుకొచ్చాడు జేబులో నుండి కొంతడబ్బుతీసి అతనికిచ్చాడు డ్రైవర్ లెక్కించి జేబులో పెట్టుకుని ఓనమస్కారంచెప్పి బయటికి వెళ్ళిపోయాడు. మధు

లోపలికివెళ్ళే ప్రయత్నంలో ఒకుర్చీతగిలి పడబోయి తమాయించు కున్నాడు)

మ . రత్నాలూ, ఒరేయ్ రత్నాలూ? (కొంతస్థాయిపెంచి రెండుమూడు సార్లు పిలిచాడు. గీత బయటకొచ్చింది మధుని చూసి, కంపించి పోయింది. "మధూ" అనిపెద్దగా అరవబోయింది కాని...... మాట అంగిలిదాటిరాలేదు. కన్నీళ్ళువచ్చాయి. మధు గాకతో మనసు పిలి కలితిరిగింది, చరచరా లోపలికివెళ్ళబోయింది) వెళ్ళిపోతున్నావా రంగీ?

గీత . [కాళ్ళకు ఏదోబంధంపడ్డట్టు ఆగిపోయింది)

మ . గుడ్డివాణ్ణి అయితేమాత్రం గుర్తుపట్టలేననుకున్నావా?

గీత . మధూ- [అస్పష్టంగా గొణిగింది]

మ . కనులులేకపోతే, నీ కాళ్ళచప్పుడు పసిగట్టలేననా? నాన్న యింట్లో వున్నాడా? రంగి, ముందునాన్నను పిలు.

గీత . మధూ-మధు (అదురుతున్న పెదాలతో అనుకుంది)

మ . మాట్లాడవేం రంగీ?

గీత . నేను రంగినికాను బాబూ [విషాదం గొంతులోచేరి కంఠాన్ని మార్చింది]

మ . రంగివికాదా నువ్వు?

గీత , కాను బాబూ, రంగినింపన్నొంచి తీసేశారు.

మ . యెందుకని?

గీత . పెళ్ళి చేసుకుంది.

మ . రంగికూడా పెళ్ళయిపోయిందా!

గీత ; పెళ్ళిళ్లు దైవనిర్ణయాలు అంటారుగా బాబూ.

మ . యింతకీ నువ్వెవరు?

గీత . కొత్తగా పనిలో చేరాను బాబూ.

మ . చిన్నప్పట్నుంచి రంగి యింటిపనులూ, వంటపనంతా చేస్తుండేది. తల్లిపోయిన తర్వాత నిజంగా తల్లిగాని తల్లిగా, ఎప్పుడేదికావాలో వెంటనేచేసేది. నవ్వించడానికి నమ్మకంగా పనిచేయడానికి రంగి చాలా మంచిది. యింతకీ నీ పేరు చెప్పావుకాదు?

గీత . ఏ పేరుతో పిలిచినా పలుకుతాను బాబూ.

మ . పిలవడానికి ఏదో ఒకపేరు కావాలిగా. అసలు మీ అమ్మా నాన్నా పేరుపెట్టకుండానే, పెంచారా నిన్ను?

గీత . లేదుబాబూ. అందరికన్నా చిన్నదాన్నని, అందరూ నన్ను "చిన్నమ్మా" అనేవారు-

మ . ఓ... నీ పేరు చిన్నమ్మ అన్నమాట.

గీత , అవునుబాబూ.

మ . నాకో సహాయంచేస్తావా చిన్నమ్మా?

గీత . ఎందుకుచేయను బాబూ. అసలునేను ఏదోఒకటి చేయడానికేగా పనిలో కుదిరింది? ఏంచేయమంటారు.

మ . నాకిప్పుడు కనులుపోయాయి చిన్నమ్మా.

గీత . లేదుబాబూ. నా రెండుకళ్ళు మీవే అనుకోండి.

మ : ఒకసారి గీతకూడా ఈ మాటేఅంది చిన్నమ్మా కాని...ఏంచేసిందో తెలుసా? చివరకు నా రెండుకనులూ పోవడానికి కారణమయింది-

గీత . చినబాబూ. [బావురుమంది]

మ . ఏడుస్తున్నావా చిన్నమ్మా ప్రాణానికి ప్రాణమై గుండెకు గుండెనై నన్ను దివ్యలోకాల్లో వెలకాంతుల్లో నడిచేలా చేసిన నా గీత నా కోసం ఒక కన్నీటిబొట్టు కార్చలేదు చిన్నమ్మా. కనీసం... ఒక నిట్టూర్పుఅయినా విడువలేదు.

గీత . లేదుబాబూ, ఆమె కళ్ళుకళ్ళు, కన్నీరంతా యింకేలా ఏడ్చి-ఏడ్చి జీవచ్ఛవంలా మిగిలిపోయింది బాబూ? [బాధపడింది]

మ . గీత నీకుతెలుసా చిన్నమ్మా.

గీత . బాగా తెలుసు,

మ . అయితే, యిప్పుడామె ఎక్కడుంది?

గీత . మీరు గుర్తుపట్టలేనంత దూరంలో-

మ . ఏమిటి చిన్నమ్మా నువ్వనేది? గీతకేమైంది?

గీత . పెళ్ళయింది,

మ . చిన్నమ్మా [గతుక్కుమన్నాడు]

గీత . నిజమే బాబూ.

మ . గీతకు పెళ్ళయిందా, కనులుపోయినా, ఆమెకోసమే జీవిస్తున్న నన్ను ఏంచేయాలని- శాకితలొంచింది?

గీత . శాకికాదు చినబాబూ, ఎగతాళికి ఈ సంఘానికి తలొంచింది. అంతేబాబూ అంతే-

మ . ఈ గుడ్డివాడికి చివరకు తీపిగురుతులే మిగిల్చిందన్నమాట.

గీత . మీకు కళ్ళెందుకు పోయాయి చినబాబూ?

మ . కనులుండీ గుడ్డివారుగా మారిన - గీతలాంటి వాళ్ళను చూడకుండా వుండేందుకే చిన్నమ్మా.

గీత . గీత మీరనుకునేంత నీచురాలు కాదులే బాబూ.

మ . ఆ ఉదేశ్యంతోనే గీతకు నా బ్రతుకు అర్పణచేశాను. అంతేకాదు చిన్నమ్మా? గీత శ్రేయస్సుకోసం, నా సమస్తాన్ని మూసగాచేసి, ఓ మహాకళామూర్తిని చేసాను. చిన్నమ్మా కాలేజీలో చదువు తున్న రోజులలో... మా యిద్దరికి కళలమీద ఆసక్తి నటనమీద భక్తి కలిగాయి. ఓ మహాకవి రచించిన మహాశిల్పి నాటిక ఆడాలని అందులో గీతకు ప్రధానమైన పాత్రనియమించి నా ప్రాణంపోసి ఆమె జీవించేలా చేశాను చిన్నమ్మా.

గీత . అవును చినబాబూ మీ గురించి గీత ఎప్పుడూ చెప్తూవుండేది.

మ . ఏమని చిన్నమ్మా?

గీత . మీరుబాగా నటిస్తారని, నటనలో జీవిస్తారని-

గీత : కాదు.... వెనెళ్ళిలరేయి

మధు: మానవతను గుళ్లో ప్రతిష్ఠింపజేయాలని పూజారులూ పురప్రము ఖులూ సిద్ధమయ్యారు. మానవతను స్నానమాడించి—గుడికి పరి పించారు—

గీత : కాని మిమ్మల్ని గుడికి దూరంగా నెట్టివేశారు

మ.. : ఎందుకో తెలుసా చిన్నమ్మా?

గీత : మానవతను సృష్టించారని—మానవతను బ్రతికించారని మానవతను బ్రతికించాలని బ్రతుకంతా అర్పణ చేశారని మానవతకు మరుజన్మ ప్రసాదించిన ఓమహాశిల్పి—కడజాతివాడని చినబాబూ!

మధు: సమతలూ—మమతలూ కలబోసి—కళాప్రతిభనంతా కరిగించి మాన వతన్ను మంచిని నేను కడజాతివాణ్ణయితే సంఘం ఒప్పుకోలేదు చిన్నమ్మా!

గీత , మిమ్మల్ని శిక్షించారు చినబాబూ!

మ.. అవును చిన్నమ్మా! అప్పుడు దూరంనుండి కళ నన్ను పిల్చింది మానవత నన్ను కేకవేసింది అన్నయ్యా అంటూ గావుకేకపెట్టింది. ఏదీ ఆ పిలుపు? ఎక్కడ నా మానవతి నిలబడింది? ఆ గుణరాశి దీనాలాపం? విషాదం నిండిన నా కళగొంతు నాకు వినిపించలేం? (అంటూ తడుముకుంటూ పడబోయీ హాలంతా వెదికాడు అప్పుడు గీత ఓ ప్రక్క—నిలబడింది మానవతలా)

గీత . అన్నయ్యా!

మధు. తళా! కళా! (అంటూ మానవత వేపునడవడానికి ప్రయత్నింతాడు ఇబ్బందిగా)

గీత . నా కాళ్లు పగిలి పోతున్నాయన్నయ్యా.

మధు. నాగుండె పగిలిపోతుం దమ్మా నా హృదయమే బ్రద్దలై పోతుంది వద్దు..నా కళను కాళ్ళు ఎద్దలు కొట్టొద్దు మానవతను మానభంగం చేయొద్దు. మీకు పుణ్యం వుంటుంది

గీత . పాపాన్ని నా ముఖమ్మీద చల్లుతున్నారన్నయ్యా

మధు. నేనెంత పొరపాటు చేశానమ్మా మానవత్వాన్ని యెప్పుడో మట్టి
పాలు చేసిన యీ మనుష్యుల్లో నవతను కలిగించడానికి మూగలై
ముగ్ధలై పడి వున్న నీకు రూపమిచ్చి ప్రాణమిచ్చి జీవకళను
ప్రసాదించి "మానవత" అని ముద్దుగా పేరుబెట్టి మూర్ఖుల చేతుల్లో
బెట్టిన పాపినమ్మా నేను.

గీత : అన్నయ్యా నా గుండెలు పగిలిపోతున్నయ్. నా ప్రాణం విలవిలా
కొట్టు కుంటుంది. కొబ్బరికాయలు నాముందు [illegible]దేకొట్టి ఆ
పాపిష్టి నీళ్ళు అందంగా-నువ్వు మలిచిన పసిడి ముఖమ్మీద చల్లు
తున్నా రన్నయ్యా. నిన్ను తృప్తిగా చూసే నాకళ్లలో ఆపా
పాన్ని చిమ్ముతున్నారు నన్ను చీకట్లో బంధించారన్నయ్యా.

మధు. అవునమ్మా. నిన్ను చీకట్లోనూ నన్ను వాకిట్లోనూ బంధించా
రమ్మా ఈకసాయివాళ్ళు నీకూ నాకూ అంతస్తుల తేడా కల్పిం
చారమ్మా. కులజాతివాణ్ణని నన్ను నా మానవతకు దూరంగా
నెట్టారమ్మా. నేను నీ దాకారాలేను కదా. నువ్వే బయటికి రావెళ్లి

గీత , తలుపులు బిగించారనయ్యా.

మధు, ఈ దుస్థితికి కారణం నేనమ్మా. పండు వెన్నెల నీడల్లో వేగడంలా
మెరిసే నిన్ను ఈపాపిష్టి మూకలపాలు చేశానమ్మా మానవతను
చంపుకుని నన్ను వీధిలోకి నెట్టివేశారు కదా. అమ్మాకదా నువ్వే
కదలిరా-కదలిరా.

గీత . రాలేనన్నయ్యా. తిరిగినిన్ను చూడలేను. నేను చచ్చిపోతాను.
చచ్చిపోతాను.

మధు. చావ కూడదమ్మా. నిన్ను చంపుకోవడానికా నేనింత శ్రమపడింది?
మానవత చనిపోతే- యీ దేశం జన్మ జన్మలకూ బాగుపడదమ్మా
మానవతను బ్రతికించడానికేనమ్మా యిన్నాళ్ళు కన్నీళ్లు దిగమింగి
కష్టాలు భరించాను.

గీత. అన్నయ్యా! గబ్బిలాలు చెవులమీద గింగుర్లు పెడుతున్నాయ్ పాలె
పురుగు ముక్కుమీద చెక్కిళ్ళ మీద నాట్యం చేస్తున్నాయ్ ఈ
హింస నేను భరించలేను. ఈ నరకం నేను భరించలేను. అన్నయ్యా
నేను చచ్చిపోతాను. చచ్చిపోతాను.

మధు. వద్దు కళా వద్దు నువ్వు చావడానికి వీలు లేదు. అయ్యా పూజారి
గారూ, మీకు దణ్ణం పెడతాను నా దేహమంతా ముద్దచేసి ముద్దుగా
మలిచిన మానవత- చచ్చిపోతానంటోంది. ఒక్కసారి ఆ గుడి
తలుపులు తెరవండి బాబూ కిందజాతివాణ్ణయితే కళానైపుణ్యం
ఉండకూడదా? కళకూ కవితలకూ కులాలు మతాలు అడ్డంగా
వున్నాయా? అయ్యా ప్రెసిడెంటుగారూ, మీరైనా చెప్పండి. అవ
తల నా మానవత చచ్చిపోతానంటోంది. పాలెపురుగులు మానవత
వంటిమీద గాయాలు చేస్తున్నాయిట గబ్బిలాలు పొడుచుకుంటూ మాన
వత గుండెల్ని చీల్చి ఆడుకుంటున్నాయిట? మున్సబుగారూ, మాన
వత చచ్చిపోతానంటోంది, తలుపు తీయండి బాబూ. తలుపు
తీయండి.

గీత. అన్నయ్యా ఏడుస్తున్నావా? నీ కళ్ళనుండి కారే ఆ కన్నీరు దోసి
లినిండి నా ముఖమ్మీద చల్లన్నయ్యా. ఈ మూర్ఖులు పులిమిన
మురికిని కడుక్కుంటాను.

మధు. కళా

గీత. అవునన్నయ్యా. ఇప్పుడు నేను.... నువ్వు సృష్టించిన మానవతను
కాను ఈ నరరూప రాక్షసుల చేతులలో నలిగిపోయిన పతితను.
నీ చేతి వులితో నగిషీలు దిద్ది- నన్నొక పసిడిముద్దగా మలిచిన
మానవతను కాను ఆ స్వార్థపరుల కులతత్వాల వూబిలో కూరుకు
పోయిన కులటను నీ పవిత్రతను ప్రాణంపోసి పలుమారులు
నన్ను పరామర్శించిన మానవతను కాను. ఆ దుష్టుల ఆలోచన
నెరవేరాలని- కొల్పరి మిగిలిపోయిన కులస్థను, మూగనన్నయ్యా.
మూగదాన్ని.

మ . వీల్లేదమ్మా! నేను మలిచిన మానవత మూగదైపోవటానికి వీల్లేదు మానవత మలినం కావటానికి వీల్లేదు ఆ జారి గారూ! మానవతను బ్రతికించండి, మానవత తన లోకంలో నేను జీవించలేను పాపాలకు ప్రతిరూపాలయిన మీమధ్య నా మానవత మరణిస్తుంటే చూస్తూ వూరుకోలేను. బ్రతికించండి. బ్రతికించండి బాబూ మీకు పుణ్యముంటుంది.

గీత . అన్నయ్యా! నాకు వూపిరాడటం లేదు, నేను మారిపోతాను.

మ . కళా,

గీత . ఆ దుర్మార్గులు చేస్తున్న దురంతాలుచూస్తూ నేను జీవించలేను. ఆ పాపిష్టిమూకల పరిహాసాలతో నా ప్రాణం నిలుపుకోలేను, పసుపు ముద్దల్ని పాపపుముద్దల్ని తిని బ్రతకలేనన్నయ్యా

మ . వద్దుకళా. నువ్వాపాపాల్ని తినొద్దు.

గీత . మరి ఈ మానవత జీవించాలంటే నాకు నీతిని నిలిపించాలి సత్యాన్ని త్రాగించాలి నిజాయితీలో స్నానమాడించాలి కాని ... వీళ్ళు! కుళ్ళు కుతంత్రాలునిండిన కొబ్బరిపీకు చలి మానవతను మచ్చలు చేస్తున్నారు అందుకే ... నాకు బ్రతకాలని లేదు. చచ్చిపోతాను. మూగదాన్నయిపోతాను. నేను మూగదాన్నయిపోతానన్నయ్యా!

మ . కళా! కళా! కళా! (బాధగా పిలిచాడు మానవత మాట్లాడలేదు) అయ్యో! భగవాన్ మానవత మూగదయిపోయిన తర్వాత నేను ఎవరికోసం బ్రతకాలి? కళా మాట్లాడు తల్లీ. నా వూపిరి నీలో వుంది. నా ప్రాణాల్లో నిన్ను మలిచి మానవతాన్ని మెరుగుపరిచిన యీ మానవ మృగాలకు మరల క్రొత్త సన్మధించిన మానవతను ప్రకాశింపచేయాలని కలలుగన్నానమ్మా కాని .... ఈ కరకుగుండెలవాళ్ళు నీ కనులు పొడిచారు. నిన్ను గుడ్డిదాన్ని చేశారు, మూగదాన్ని చేశారు నా కళ్ళముందే నిన్నింత నీచంగా వికృతంగా బంధించి ఒడలు చిల్లులు పడేలా కొట్టికొట్టి నీ పవిత్రరక్తం చిందించి నవ్వుతూ నిలబడితే నాకీ కళ్ళెందుకు? ఎవర్ని చూడాలి?

ఈ పాపాన్ని నేను చూడలేను ఈ పాపిష్ఠి ముఖాలు నేను చూడలేను
అందుకే .. అందుకే నాకీ కనులు వద్దు నేనూ గుడ్డివాణ్ణయి
పోతాను నేనూ గుడ్డివాణ్ణయిపోతాను [అంటూ దాగాకాలుతున్న
లావుపాటి సాంబ్రాణి కడ్డీలు అందుకుని రెండు కనులు కాల్చుకు
న్నాడు "అబ్బా" అంటూ చేతులతో కనులు దాచుకున్నాడు.
"చినబాబూ" అంటూ గీత పట్టుకుంది]

గీత . చినబాబూ చినబాబూ

మ . (తేరుకున్నాడు గతంనుండి] విన్నావుగా చినమ్మా. గీతకూ- నాకూ
స్పర్ధలువచ్చాక- నా మిత్రులకోరికపై మళ్ళీ ఈ నాటిక ఆడవలసి
వచ్చింది. గీత నటించవలసిన పాత్రలో మరో క్రొత్త అమ్మాయి
నటించడంవలన నిజంగానే నాకనులు పోయాయి చిన్నమ్మా.

గీత . మధూ [అంటూ బావురుమంది, బ టను డి కరుణాకరంవచ్చాడు.
గీత దుఃఖాన్ని దిగమింగి లోపలికి వెళ్ళింది]

కరు . ఎంతసేపయింది బాబూ వచ్చి?

మ . యిప్పుడే నాన్నా

కరు . నీకోసం... నేను ఆస్పత్రిదాకా వెళ్లాను.

మ . ఆ లోపలికివెళ్ళింది ఎవరునాన్నా?

కరు . అన్నట్టు చెప్పడమేమర్చిపోయాను, ఆమె నీపినతల్లి బాబూ

మ . మళ్ళీ మీరు పెళ్ళిచేసుకున్నారా నాన్నా?

కరు . అదే నేనుచేసిన తప్పు బాబూ

మ . తప్పేముందిలే నాన్నా యింటిలో జ్యోతినివెలిగించారు.

కరు . చీకటి విడిపోవాలని- చీకూ చింతలు మాసిపోవాలని నేనీ పనిచేయ
లేదుబాబూ అయినా అమ్మను కరువుచేసుకున్న నీకు- మరో
అమ్మనుతెచ్చి ఆలోటుతీర్చాలని నేనీ ప్రయత్నం చేయలేదు.
తప్పయితే నన్ను క్షమించు మధూ.

మ . అంతమాట అనకండినాన్నా. అలామాట్లాడి ఈ గుడ్డివాడి గుండె

లలో మనుశను చంపకండి. [యింతలో గీత కాఫీ ట్రేతో వచ్చి టీపాయ్‌మీద పెట్టింది ]

కరు . కాఫీ తీసుకో బాబూ! (అంటూ కాఫీకప్పు చేతికిచ్చి తనొకటి తీసుకు న్నాడు యిద్దరూ త్రాగి కప్పులు టీపాయ్‌మీద పెడితే, అవి తీసుకుని గీత లోనికి వెళ్ళబోయింది] చూడుగీతా. మధును యికమంది నువ్వే స్వయంగా చూసుకోవాలి. తల్లిని పోగొట్టుకుని యింత కాలం చీకట్లోనే కాలంగడిపాడని, నేను తపించాను. కాని ఇప్పుడు ఈ ప్రపంచానే చీకటి చేసుకున్నాడు యికమీదట ... నీ రెండు కళ్ళూ బాబుకిచ్చి, బ్రతుకును పూలబాటచేసే బాధ్యత, భారం నీదే.

గీత . అలాగేనండి ... అలాగే,

కరు . విన్నావా మధూ! గీతకు నువ్వంటే ఎంత అభిమానమో-

మ . భగవంతుడు చాలా మేలు చేశాడు నాన్నా. నాకీ లోకాన్నే చీకటి చేశాడు.

కరు . మధూ!

మ . అవునాన్నా. పాపాలనూ, మోసాలనూ చూడకుండా కళ్ళుతీశాడు, ఆత్మీయతనూ, అనురాగాన్ని పంచుకోవడానికి యింకా ప్రాణా లనుమాత్రం వుంచాడు.

కరు . మధూ,

గీత . చిన్నబాబును స్నానానికి తీసుకురండి. (లోనికి వెళ్ళింది)

కరు . పదబాబూ! విశ్రాంతి తీసుకుందువుగాని [అంటూ మధును లోనికి తీసుకెళ్ళాడు చేయిపట్టుకుని. క్షణంనిశ్శబ్దం. యేదో విషాదగీతం విన్పడుతూవుంది, మధు తడుముకుంటూ బయటకొచ్చాడు గీత వెంటవచ్చింది)

గీత . యిలా అన్నంపిస్తూ మానేసి, నామీద పగ తీర్చుకుంటావా మధూ?

మ . నీమీద జాలి పడేదెవరు?
గీత . అన్నం లో ఆ మాత్రం లేదా వేం?
మ . ప్రాప్తం వుండాలిగా.
గీత . మధూ!

మ . దేవుడు చాలా తెలివయినవాడు గీతా.
గీత . అవును నిన్ను గుడివాణ్ణి నన్ను మూగదాన్ని చేశాడు.
మ . చాలా అదృష్టవంతురాలివి గీతా!
గీత . నామీద నీకు అసహ్యంగా లేదూ!

మ . (పెదాలమీద నవ్వొచ్చు) ఎందుకు గీతా? ఆశలు నాదోసిలినిండా పోశా
వనా, మమతలు నా మనసులో నింపావనా? చేతికొచ్చిన హృద
యాన్ని నేలవేసి విసిరికొట్టావనా? ఎందుకు నీమీద అసహ్యం.
గీత . నా పరిస్థితి నీ కర్థంకాలేదు మధూ?

మ . నీకుమాత్రం ఏమర్థమయిందని, యింత త్యాగానికి పూనుకున్నావు?
గీత . నేను చేసిన తెలివిమాలిన పనికి త్యాగం అని పేరుపెడుతున్నావా
మధూ!
మ . అసలు నేను నీకేం అపకారం చేశానని, నన్నింత అన్యాయం
చేశావు?
గీత . మధూ!

మ . నేనేం పాపంచేశానని నన్నిలా నవ్వులపాలు చేశావు?
గీత . లేదు మధూ? నేనేం చేయలేదు అంతా విధేచేసింది.
మ . విచిత్రమయిన విధివేటలో మన్నోడిపోయాం, నిన్ను నముక్కునన్దుకు
దుకు నన్ను గుడ్డివాడిని చేశావు.

గీత . లేదు మధు? అంత అభాండంమాత్రం నామీద వేయకు,
మ . మట్టిలావున్న నిన్ను మణిగచేస్తే నన్ను మట్టిలోకి నెట్టివేశావు.
యింత కఠినంగా శిక్షించడానికి... నేనేం ద్రోహంచేశాను?
త . పాపం చేసింది నేను మధూ! అందుకు తగినశిక్ష నేననుభవించాలి.

క్షమించమని అడిగే అర్హతను కూడా పోగొట్టుకున్న నాకు శిక్ష కావాలి మధూ?

మ. ప్రేమపేరుతో మనతల్లి మందిరాన్ని కూలదోశావు, తాళికట్టించుకో వలసినదానివి తల్లివయి, నా కళ్ళముందే నిలిచావు? ఇంతకన్నా నీకు మరో శిక్ష ఏముంటుంది గీతా?

గీత. తల్లిని గాకపోయినా ఆస్థానంలో వున్నదాన్ని: మారుతల్లిననే అపవాదుమాత్రం నాకురానివ్వకు మధూ! నీకు పుణ్యముంటుంది-

మ: ఒకనిజం చెబుతావా గీతా?

గీత: ఎప్పుడయినా నీకు అబద్ధంచెప్పానా మధూ-

మ: పెళ్ళిచేసుకుందామని చేతిలో చెయివేసి, ఎదలో ఎదనుకలిపి, ఎందుకిలా దూరమయ్యావు?

గీత: మధూ.

మ: చెప్పుగీతా, ఇప్పుడయినా నిజంచెప్పు,

గీత. చెప్పలేను మధూ! ఇప్పుడు నేనేం చెప్పలేను.

మధు: అయితే నేనీఇంట్లో వుండటంకూడా నీ ఇష్టంలేదన్న మాట?

గీత. మధూ:

మధు. గీతా? నేనీయింట్లో వుండాలన్నా- తల్లిస్థానంలో వున్న నిన్ను గౌరవించాలన్నా- నాకీ నిజం చెప్పితీరాలి.

గీత: అయ్యో భగవాన్?

మధు. నీమీద నాకున్న ప్రేమ విరిగిపోకముందే చెప్పుగీతా.

గీత: ఏమని చెప్పను మధూ? నాకు జరిగిన అన్యాయాన్ని దౌర్భాగ్యాన్ని నీకేమని చెప్పను? ఎలా చెప్పను

మధు: అంటే... మనిద్దరమయినా తప్పుచేశామా?
గీత : నా మీద నమ్మకం లేదా నీకు?
మధు: మరేం మిగిలింది?

గీత . తోటలో అందాల గులాబీలు పరిమళాలు విరజిమ్మే విరిసిన పుష్పాలు వుండయ్ అవి రాలిపోవడానికీ వాటి రేకులు రాలిపోవడానికి - కారణం ఎవరంటావ్,

మధు: ఆడవాళ్ళు

గీత . నిజమే, ఆడవాళ్ళే కాని ఆడదాన్ని పువ్వులా వాడుకునేది మగ వాళ్ళు కాదా మధూ?
మధు. అంటే నువ్వు?

గీత . నలిగిపోయాను మధూ పూజకు వినియోగపడవలసిన పువ్వు [illegible] కాళ్ళ క్రిందపడి నలిగిపోయింది. మధూ
మధు: గీతా

గీత అవును మధూ అపవిత్రం అయిన యీ శరీరాన్ని నీకు అర్పణ చేయలేక విషాదాన్ని నీకు మిగిల్చాను నిన్ను పెళ్ళాడి ఆత్మవంచన చేసుకోవడం మోసమనే చీకటిని నీకు మిగిల్చాను.

మధు. అర్థమయింది గీతా! ఇక నువ్వేం చెప్పకు-

గీత . వాడిన పువ్వు లేని నవ్వు తెచ్చి పెట్టుకుని పరమాత్ముని పాద పద్మాల మీద పడితే దేవుడు క్షమిస్తాడా? పూజకర్హం మేమని చిన్న పువ్వులు చిందిస్తాడా చెప్పు మధూ. హృదయపూర్వకంగా నువ్వే చెప్పు

మధు. ఇంత అన్యాయం జరిగినా విషాదాన్ని గుండెల్లో ఎలా దాచుకు న్నావ్ గీతా?

గీతా . చెప్పుకునే అవకాశంలేక,

మధు: చేతులారా నిండు బ్రతుకును అర్పణ చేశావన్నమాట
గీత : తలదాచుకోవడానికి ఏ చెట్టనీడయినా కావాలిగా మధూ!
మధు: గీతా!

గీత : దేవుడునన్ను పాపగ్రస్తురాలిగా సృష్టించాడు మధూ అందుకే... చేదును మింగుతూ తీపి అనుకుంటూ నేను, చీకటి ముసుగు వేసుకుని, వెలుగు రేఖలే అనుకుంటూ మవ్వూ. ఇలా నశిపోయే వాళ్ళమే కాదు. ఈ మసిగుడంలో యిలా కలుసుకునే వాళ్ళమే కాదు.

మధు: లేదు గీతా! మనిద్దరం విడిపోవడం వల్ల మంచికి దూరమై పోతున్నాం. నాన్నగారికి, మళ్ళీ వెలుగు బాట చూపిందావు! నీ నిర్ణయంలో తప్పులేదు గీతా

గీత . నీకంతవరకే తెలుసు మధూ కానీ గట్టారన్నమాటేగాని,... ... హృదయంలో నాకింతచోటు యివ్వలేదు భార్యగా బాధ్యతలు నెరవేర్చడానికి, అవకాశం యివ్వలేదు మధూ

మధు: అదేమిటి గీతా! ఆయన నిన్ను కావాలనే చేసుకున్నాడుగా....
గీత. లేదు మధూ! గులాబి గాలికి, ఎగిరి ఎక్కడో పడుతుందని, ఓ గుడి మూగిట పడవేశాడు అంతే మధూ

మధు: నాన్నగారు... న్యాయానికి అన్యాయం చేయడుగీతా!
గీత . ఆదేవునికి నేను అన్యాయం చేయలేను మధూ! అందుకే....
మధు: ఏం చేస్తావు?

గీత : కడుపులో కలుషితాన్ని కలిపి, బ్రతుకును విషమయం చేసుకోలేను-

మధు. అంటే...

గీత . పవిత్రదేవాలయంలో పాద రేణువుగానైనా పనికిరాని నేను, పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకుంటాను.

మధు. పారిపోతావా?

గీత. దూరంగా వెళ్ళిపోతాను.

మధు. తాళికా? లోకానికా?

గీత. రెంటికీ-

మధు. నన్ను సుద్ధివాణ్ని చేశావు? సుద్ధిగా నిన్ను పెళ్ళాడిన నాన్నగారిని మళ్ళీ త్రాగుబోతునే చేస్తావా గీతా?

గీత. మధూ

మధు. ఆయన సర్వనాశనానికే పునాది వేస్తావా?

గీత. మధూ- ధు

మధు. చెప్పు గీతా? ఏం చేస్తావు?

గీత. తాళికి తలొంచానుగాని...యీలోకానికి, సంఘానికి తలొంచి, మిగిలిన జీవితాన్ని యీదలేను మధూ నాకాశక్తిలేదు,

మధు, చూడు గీతా! గతాన్ని మర్చిపోయినవాళ్ళు, తప్పుల్ని దిద్దుకున్నవాళ్ళు ధన్యులని పెద్దలంటారు. అలాగే...మనిద్దరి మధ్య జరిగిందంతా ఓ పీడకలగా, చెరిగిపోనీ, అప్పుడు నాకు పరిచయమై ప్రేమపాలు ప్రసాదించిన గీతవు కాదు నువ్వు. ఉగ్గుపాలు త్రాగించి, ఉయ్యాలలో పడుకోబెట్టి-జోలపాడి, జోకొట్టిన తల్లివి నువ్వు-

గీత. మధూ

మధు రాగాలూ- అనురాగాలూ- పొలికించి- యెదలో యెదను పరిచిన గీతవు కాదు నువ్వు- మాతృత్వపు పాలలో అమృతాన్ని కలబోసి- బ్రతుకిచ్చిన మాతృమూర్తివి నువ్వు- అందుకే ....నువ్వు బ్రతకాలి-నూరేళ్ళు బ్రతకాలి.

గీత. ఎవరికోసం మధూ.

మధు. నాన్నగారికోసం ఇంటిగౌరవం మంట గలిసి పోకుండా వుండటం
కోసం ఈ చీకటిని వెలుగులోనికి నడిపించడంకోసం

గీత. నాకు శిక్ష కావాలి మధూ శిక్షకావాలి.

మ : ఏ దేవుడయినా నిన్నింతకన్నా యింకెలా శిక్షించగలడు గీతా?
గీత : మధూ.

మ : నన్ను మేడమీదకు తీసుకువెళ్ళగలవా గీతా?

గీత : అలాగే మధూ! అలాగే (అంటూ చెయ్యిపట్టుకుని మేడమీదకి నడి
పించుకువెళ్ళింది క్షణం నిశ్శబ్దం. మదన్ బయటినుండి వచ్చాడు.
హాలంతా పరీక్షించాడు టీపాయిమీదున్న యాపిల్ పండు అందుకుని
కూర్చున్నాడు. చెయ్యి రెండూ టీపాయిమీద పెట్టి పండును కత్తితో
తరుగుతున్నాడు కరుణాకరం లోపల్నుంచి వచ్చి మదన్ని చూసి
నిర్ఘాంతపోయాడు]

మద: యింటిదాకా వచ్చానని బాధగావుందా?

కరు : ఎందుకొచ్చావు!

మ : ఎందుకొస్తానో తెలుసుగా కూర్చోండి.

కరు : నా యింట్లో నాకు మర్యాదేమిటి?

మ : (నవ్వుతు) నీయిల్లా! మనిల్లు మనిల్లు అనుకో, బావుంటుంది.
కరు : నోర్ముయ్!

మ : నోరుమూయించడం మదన్ కు అలవాటయినా– యిప్పటిదాకా నోరు
మూసుకునే వూరుకున్నాడు. ఎందుకో తెలుసా.

కరు : [చూసి వూరుకున్నాడు)
మ : చెప్పలేవు కరుణాకరం, నీకోసం నీ క్షేమంకోసం–

కరు : యింతకీ నువ్వొచ్చిన పనిచెప్పు.

మ : నచ్చినవాడి కవ్వరం నచ్చినదానికే వెక్కరం జరుగుతూనే వుంటుంది.

కరు : అయినా నీకేం తక్కువచేశాను?

మ : ఏముందని- అసలు నాకేం మిగిలిందని?

కరు : మదన్

మ : చెప్పు కరుణాకరం. నాకేం మిగిల్చావు? తయారయిన బాల్యం తనంలో పదిమందికి తలవంచుతూ- బ్రతుకును వెళ్ళకం చేసుకు న్నాను భవిష్యత్తును చీకటి చేసుకున్నాను. దర్జాకి తల వంచుతూ సంఘానికి తలొంచుతూ యిలా యెవరికి కానివాడిలా, యేమీ లేనివాడిలా తిరుగుతున్న నా అదృష్టానికి కారకు లెవరు? నువ్వు.... నువ్వు....

కరు : నన్నెందుకు మాటలతో చంపుతావు?

మ : కత్తులతో చంపటం యిష్టంలేక.

కరు : ఒకరికి అన్యాయం చెయ్యటం నాకిష్టంలేదు.

మ : యిప్పటిదాకా నువ్వు ఎవరికి న్యాయం చేశావు?

కరు : అందరికి అందరికి మదన్

మ : మరి నన్నెందుకిలా చేశావు?

కరు : కొందరు చేతులారా బ్రతుకును బజారుపాలు చేసుకుంటారు.

మ : బజారుజీవితాలను దాగుచేసేవాళ్ళు కొందరుంటారుగా-

కరు : మదన్,

మ : చెప్పు కరుణాకరం నేనిలా బజారుబిడ్డగా బ్రతకటానికి కారణం యెవరు?

కరు : నేనుమాత్రం కాదు.

మ : నువ్వే నువ్వే నువ్వే

శశి : కాదూ కాదూ కాదు.

మ : నీతో వాదించి లాభంలేదని యిదివరకే నిర్ణయించుకున్నాను.

శశి : అయితే యిప్పుడెందుకొచ్చావు?

మ : తెగతెంపులు చేసుకుందామని.

శశి : నేను ఆలోచించుకోవాలి.

మ : ఏమిటీ? ఏమిటి నువ్వాలోచించేది.

శశి : భవిష్యత్తును ఎలా బంగారంచేయాలా అని?

మ : కాదు నా నవనాడుల్లో ప్రవహించేది ఎవరి రక్తమోనని-

శశి : కాదు మదన్ అలా కానేకాదు.

మ : ఈ కత్తి తీసుకోండి. శరీరంలో ఎక్కడకావాలో కోసి చూడండి అణువణువులో నరనరాల్లో ఎవరిరక్తం గడ్డకట్టివుందో తెలుస్తుంది

శశి : నన్నెందుకురా చంపుతావ్,

మ : చంపడం నాకెంత సులువైనా- ఏ బంధానికో నా చేతులు కట్టబడి పోతున్నాయ్ కరుణాకరం; అందుకే. నువ్వింతకాలం బ్రతికావు ఇంకా బ్రతుకుతున్నావు; బ్రతుకుతావు గూడ త్వరలో....అ నవి చేస్తే....

శశి . ఎంతివ్వమంటావు?

మ . ఎంతిస్తే సరిపోతుందో నువ్వే ఆలోచించు.

శశి . పాతిక వేలిస్తాను వెళ్ళిపో.

మ . (నవ్వారు హేళనగా)ఒక అమాయకురాలి శీలం ఖరీదు పాతిక వేలన్న మాట?

శశి : మదన్

మ : తొమ్మిది నెలలు మోసినందుకు కని చనుబాలిచ్చి జోకొట్టి జోల పాడినందుకు ఏమిస్తావు కరుణాకరం ఎంతిస్తావు?

కరు : మదన్.

మ : శీలానికి ఖరీదు కట్టావుగాని కన్నతల్లి మాతృత్వానికి వెలగట్ట లేదేం? ఆమె నిండు జీవితం కుంటగా పగిలిపోయినందుకు ఎంతిస్తే సరిపోతుందో ఆలోచించు అందరిలా గుండెమీద చెయ్యేసుకుని నిండుగా బ్రతికే అవకాశాన్ని అదృష్టాన్ని కరువు చేసుకున్న నేరానికి నువ్విచ్చేదు. పాతికవేలా? నా బ్రతుకు ఖరీదు ఒక్క పాతికవేలా? చెప్పు కరుణాకరం.

కరు : మదన్, ఇప్పుడు నా మనసేం బాగుండలేదు, నన్ను ఆలోచించు కోని విశ్రాంతి తీసుకోనీ వెళ్ళు.

మ : చూడు కరుణాకరం నేను ఆస్తిపంచమని అడగడానికి రాలేదు ఆత్మీయత పంచిపెట్టు.

కరు : అదేనేను ఆలోచించుకోవాలి.

మ : కరుణాకరం నీ చేతిలో వున్న న్యాయ శాస్త్రాన్ని అస్త్రంలాగా మీద ప్రయోగించి నా అభాగ్య జీవితాన్ని ముక్కలు చేశావు బ్రతుకంతా మచ్చలు చేశావు ఈ కలుషితాన్ని కడిగివేసుకోవడానికి కాలం. కరుణించదని నాకు తెలుసు. అందుకే ... దారిమార్చుకున్నాను. నన్ను చూస్తే ఈ దిక్కుమాలిన సంఘం బెదిరిపోయేలా మారి పోయాను నేనూ మనిషినైనా సంఘంనన్ను వేలెత్తి చూపింది ఎగతాళి చేసింది. హేళనగా చూసింది గేలిచేసింది గోలచేసింది నాలో పగను పడింతలు చేసింది. అందుకే కరుణాకరం నేను మనిషికాని మనిషిగా మారిపోయాను, ఈ కత్తి నా చేతిలో వున్నంతకాలం చట్టానికి సమాజానికి న్యాయానికి ధర్మానికి భయ పడే దుస్థితి లేకుండా చేసుకున్నాను. అందుకే... అందుకే ... కరుణాకరం నా గుండె అగ్నిగుండంగా మారిపోయింది ఇప్పుడు

నా కర్తవ్యం ఐక్యసాధన మనిషికి మనిషికిమధ్య దేశానికి దేశానికిమధ్య వర్గానికి వర్గానికిమధ్య స్వార్థాన్ని అగాధాంలా చేసిన మీలాటి న్యాయమూర్తుల కసాయితనాన్ని కత్తిరించి వేయడమే ప్రస్తుతం నేను చేయవలసిన పనిఇప్పుడు నేను ప్రశ్నించేవాణ్ని చేతులు కట్టుకుని బదులు చెప్పవలసిన వాడివి నువ్వు నేను శిక్షించేవాణ్ని నా యెదుట తలొంచే నేరస్తుడివి నువ్వు

కరు : కాదు ... నేను నేరస్తుణ్ని కాదు మదన్.

మ : ఎందుక్కాదు? అందరి అధికారం అహంకారం కలబోసిన్యాయం అనే పేరుతో ప్రభుత్వ బలంతో నన్ను నేరస్తుణ్ణిచేసి. నాచుట్టూ విషవలయాన్ని పన్ని, పన్నిలాచేసిన నువ్వు... యింకేమవుతావ్,

కరు : మదన్

మ : చెప్పు కరుణాకరం? మనిద్దరినమస్యగా కాకపోయినా-న్యాయమూర్తి ఒక నేరస్తునివల్ల చూపవలసిన కనీససానుభూతితో చెప్పు, ఇందులో నా తప్పేమిటో, అందుకు శిక్షేమిటోకూడా నువ్వే చెప్పు-

కరు : చెప్పలేను మదన్? ఇప్పుడు నేనేం చెప్పలేను నామనసుపగిలి పోయింది, రగిలి పోతుంది-

మ : ఆ మాటలమీద ... నా సానుభూతిని తిరస్కరించ మంటావా?

కరు : వద్దు మదన్? ఇప్పటికే... పినహీనంతో నా బ్రతుకంతా కరిగి పోయింది.

మ : ఇంకేం చేయమంటావ్?

కరు : ప్రస్తుతం... యిక్కడనుండి వెళ్ళిపోవాలి.

మ : మళ్ళీ ఎప్పుడు కన్పిస్తావు?
కరు : నేనే కబురుచేస్తాను?

మ : చూడు కరుణాకరం! ఆత్మీయతనూ, అభిమానాన్ని దూరం చేసుకుని నన్ను మానవతకు దూరం చేశావు? అయినా నిన్ను క్షమించాను. ఇంకా క్షమిస్తున్నాను నీ సుఖం, నీ ఆనందం, నీ తృప్తి కూడా కని, చరిత్రలో ఒక తీయని దుర్మార్గుడుగానే మిగిలిపోయావు నువ్వు నమ్ముకున్న న్యాయానికి, ధర్మానికి, నీ తప్పులకు ఎప్పుడో క్షమార్పణ చెప్పుకోవలసిన దుస్థితి, నీకూ వస్తుంది, గుర్తుంచుకో, వస్తా. [వెళ్ళబోయిఆగాడు]

కరు : ఆగిపోయావేం?

మ : ఈసారి నేను యింటికి రావడం జరిగితే, బంధాలు తెంచుకోవడం, ఆస్తులు పంచుకోవడం జరిగితీరుతుంది.

కరు . అలాగే-

మ : వస్తా? (వెళ్ళబోయి, ఆగాడుమళ్ళ)

కరు : ఇంకేం కావాలి?

మ : ఒక్కసారి నువ్వు పెళ్ళాడిన తల్లి కాని తల్లిని ఇలా చూసివెళ్తాను

కరు : మదన్

మ . నా తల్లిని ఆమె కళ్ళలో చూసి- తృప్తిగా నిట్టూర్చి వెళ్ళిపోతాను కరుణాకరం

కరు . మదన్?

మ . ఇన్నాళ్ళూ కరువైన మాతృత్వాన్ని- తల్లిప్రేమలో నిండిన ఆత్మీయతను, ఆ చల్లతల్లిని చూసి,వెళ్తాను-

మూ . అలాగే మదన్, అలాగే, కాని... కాని... ఒక్క షరతు-

మ . నాకు తెలుసు కరుణాకరం మనిద్దరకున్న సంబంధం ఆమెకు తెలి కూడదు. అంతేకదూ?

కరు . అంతే మదన్ అంతే. [ఇంతలో గీత బయటికొచ్చింది. మదన్ని చూసి, నిర్ఘాంతపోయింది: మదన్ కూడా ఓ రెప్పపాటు స్థాణువులా అయిపోయారు) అ.., మదన్ ఈమె... ఈమే నయ్యా నా భార్య... గీత,

మ . గీత... బాగా పరిచయమైన పేరులావుంది.

గీత . వీడే... వీడేనండి-(అంటూ పడిపోయింది. కరుణాకరానికి పరిస్థితి అర్థంగాక... ఆమెను సోఫాలో పడుకోబెట్టారు]

మ . కరుణాకరం పాపం ఆమెకు మూర్ఛలరోగం వున్నట్టుంది. డాక్టర్ని పిలిచి చూపించు, వస్తా! [అంటూ చరచరా బయటివెళ్ళాడు]

కరు . గీతా గీతా ఏం జరిగింది? రత్నాలూ? ఒరేయ్ రత్నాలూ? (కంగారుగా పిలిచాడు, రత్నాలు వచ్చారు) ఒరేయ్... ముందు గీతను లోనికి తీసుకు వెళ్దాంపద-

ర . ఏమయింది బాబుగారూ? అమ్మగారెందుకిలా పడిపోయారు?

కరు . జీవితమే అరుగున పడిపోయింది రత్నాలూ? ముందు గీతను లోనికి తీసుకు వెళ్దాంపద; (అంటూ యిద్దరూ ఆమెను చేతులమీదగా యింట్లోకి తీసుకు వెళ్ళారు-హడావుడిగా కరుణాకరం ఫోను అందుకున్నాడు) హలో!... కరుణాకరం స్పీకింగ్? మీరు వెంటనే బయలుదేరిరావాలి... మా ఆవిడ అకస్మాత్తుగా పడిపోయింది అబ్బే... జబ్బేంలేదండి, వూరికే పడిపోయింది. నో... నో... అలాటిదేమీ లేదూ. ప్లీజ్... వెంటనే రావాలి-"(రిసీవర్ పెట్టేసి-లోనికివెళ్ళాడు రత్నాలు బయటికొచ్చాడు. డాక్టర్ బయటినుండి రాగానే. ఆయన

చేతిలో బ్యాగ్ రత్నాలు అందుకున్నాడు ఇద్దరూ లోనికి వెళ్ళారు, క్షణం నిశ్శబ్దం డాక్టర్ బయటికొచ్చాడు. కరుణాకరం వెంటవచ్చాడు

డా : మరేం కంగారుపడకండి కరుణకరంగారూ

కరు . ఏమయింది డాక్టర్?

డా షియీజ్ ఆల్ రైట్ మిష్టర్ కరుణకరం బట్...

కరు , బట్? బట్ హేపెన్డు వాట్ హేపెన్డు టుహర్? టెల్ మీ డాక్టర్ ప్లీజ్ టెల్ మీ

డా :షియీజ్ ప్రెగ్నెంట్-

కరు . డాక్టర్ [నిర్ఘాంతపోయాడు.]

డా : యూ ఆర్ యే లక్కీ-ఫెలో కరుణాకరం (రత్నాలు బయటి కొచ్చాడు,)

కరు . డాక్టర్ మరేం చెబుతున్నారు?

డా : త్వరలో మీరు... ఓ బిడ్డకు తండ్రి కాబోతున్నారు.

కరు : నో-డాక్టర్ అలా జరగడానికి వీలేదు-వీలేదు. డాక్టర్

డా : కరుణకరంగారూ తండ్రికావటం మీకిష్టంలేదా?

ర. : డాక్టర్‌గారూ మా బాబుగారు తండ్రి కాబోతున్నారా?

డా : అవును రత్నాలు

ర : బాబుగారూ నిజమేనా? డాక్టర్ బాబు చెప్పేది నిజమేనా?

కరు : లేదు డాక్టర్ ఇది నిజం కాదని ఒక్కమాట చెప్పండి.

డా : నిజాన్ని అబద్ధంగా మార్చడానికి-నేను పోలీసు అఫీసర్ని కాదు కరుణకరం డాక్టర్ని బియ్యాం ఏ డాక్టర్,

కరు : అయితే... గీత..

డా : త్వరలో ఒకమంచి బిడ్డను కనబోతుంది- శలవు-

(అంటూ బయటికి వెళ్ళారు)

ర : బాబుగారూ చినబాబుగారికి... రత్నంలాంటి తమ్ముడు పుడతాడు,
కరు : లేదు రత్నాలూ గీత తల్లి కావడానికి వీలేదు.
ర : బాబుగారూ ఏమంటున్నారు?
కరు . నిజం... మాటికి మారుపాట్కు నిజం రత్నాలూ

ర . అదేమిటి బాబూ పసిబిడ్డ పారాడితే ఇల్లంతా పచ్చగా వుంటుందంటా బోసినవ్వులు కురుపిస్తే, మనసులు మమతల సిరులతో నిండి పోతా యంటారే మీరు వద్దంటున్నారా? వెన్నెలాంటి చల్లని ముద్దులు— వద్దంటున్నారా?

కరు . ఒరేయ్ నన్ను కాస్త విశ్రాంతి తీసుకోనీ-నీ వ్యక్తి నా గుండెల్ని గాయాలు చేయకు- వెళ్ళు—వెళ్ళరా-

ర : అలాగే బాబూ అలాగే ఆ తల్లి కడుపున చిర్నవ్వుల పంట పండితే తమ్మైల పండుగ్గా చూడాలని- ఎన్నో కలలు గన్నాను. ఇప్పుడా కలలన్నీ చంపివేసుకుని కళ్ళు మూసుకుని వెళ్ళి పోతాను బాబూ వెళ్ళిపోతాను [అంటూ బరువు కళ్ళతో లోనికి వెళ్లాడు ఏదో విషాద గీతం వినిపిస్తుంది, కరుణాకరం చెమటతో తడిసిపోయాడు బరువెక్కిన గుండెలమీద చెయ్యేసుకుని కూలబడిపోయాడు. తెర సున్నితంగా జారింది]

# అయిదవ రంగము

[అలంకరణ మామూలుగానే వుంది. రమణ యిటునుండి కళ్ళతో గోడలకు తగిలించిన చిత్రాల వేపు మహాపటుడులా పరీక్షగా చూస్తాడు. దాదాపు అతని వాలకం పౌరాణిక నాటకంలో మహా రాజులా వుంది ఒకటి రెండుసార్లు అటూ యిటూ తిరిగాడు]

రమ. అహా ఏమి తవన రమణీయకము ఈ సుందర సౌధమ్ములో విహ రించు వారలెంత ధన్యులు ఈ వయ్యారి భామ ఎవరై యుండును? ఓహో అజంతా శిల్ప సుందరి కాబోలు. యీమె యేకదూ. విషాద మ్నల కన్నెలపాప, ఓహో ఈ అమ్మలయిన్న ఎవరై యుండును? [తలగోక్కుంటూ బాగాఆలోచించాడు] తెలిసినది తెలిసినది- తెలుగు సంస్కృతివిపణికి వుద్ఘు కున్ననండూరివారి నెలవంక ఎంకి కాబోలు అర్థనిమీలిత నేత్రాలతో అందమయినో కోరికలు నింపుకొని యెదురుచూస్తున్న యీ నయగారి ఎవరో? ఓహో.. పవ్వుల్ని ఉ.వ్వరువరపాంపిన్ని గ్లాసునిండా నింపిఎర్రని బుగ్గలతో నాటు పోటీకందించడానికి? ఉబలాటపడుతున్నసాకి కాబోలు. ...అహా.. ఏమిప్రాభవమందలి నివసించువారలుగంతధన్యులు కారుగదా ఓయీ నీవుఎవ్వడవు? ఏకాంతంబున ఒంటిగా తపించు చున్నాడవు? ఓరీ పోయిన మంత్రివి కాదుగదా ఏమనుచున్నాడవు? ఓరిపోయిన దొరల ఏకముగా వెంకటేశ్వరస్వామి సన్నిధికి ఏగువాడవను

ఉంటివా అవునవును ఇశ్వరీత్వ నాదిజయు గ్రహించిన ప్రేమికాశ త్రీ నాలోహారులు. (ఇంతలో తగి బయటకొచ్చింది)

గీత : ఎవరూ?

శమ: ఎవరైనదీ అర్థం చేసుకోలేని నీ దౌర్భాగ్యమునకు నేనెంతయో చింతించు చుంటిని మిత్రమా ఏమీ మిత్రమా అని సంభోధించిన అవమానము కలుగునా? ఓయీ సిగ్గులేటు. వేలకు వేలు దొంగ వోట్లు వెదజల్లి ఓట్లు కొనుక్కొని ప్రజల చేతుల్లో ఓడిపోయిన విన్ను మిత్రమా అని సంభోధించిన వాతెలివి తక్కువతనానికి నేనే చింతించి చుంటిని నేనేచింతించుచుంటిని. [అంటూ ముక్కు చీదాడు]

గీత . వద్దురావా. నువ్వు చింతిస్తే నేను చూడలేను.

శమ. ఓ ఇంతసేపు నేను మాట్లాడినది..,, నీతోనా గీతా?

గీత . కాదు... గోడల మీదవున్న బొమ్మలతో.

శమ. బొమ్మల్లాంటి మనుషులతో మనసువిప్పి మరీ మరీ మమతలగోడు వినిపించే దానికంటే నోరులేని ఆ గోడమీద బొమ్మలే నయం గీతా,

గీత . బావా

శమ. ఐయాం సారీ గీతా విన్ను చూసిపోదామని యిక్కడ దాకా వచ్చాను కాని నీకన్నా ముందుగా గోడల నలంకరించిన యింతులు వింత వింతగాచూసి నన్ను పులకరించేలా చేశారు. ఆ ఇంతకీ మీనాన్న?

గీత . ఇప్పుడే బయటికి వెళ్ళారు. కాఫీ తెస్తాను. కూర్చో బావా [వెళ్ళిపోయింది]

శమ. అ,. గీతా. నేను కాఫీ త్రాగడం మానేశాను.

గీత . అదేమిటి బావా.

రవి. నేను జీవితంలో మొదటిసారిగా చేసిన మంచి పని అదే గీతా.

గీత . కాపీ మానేయటంలో మంచితనం బయటపడదు బావా మనిషిలా బ్రతకాలి. మానవతను అందరికి పంచి పెట్టాలి అప్పుడు నువ్వు నిజంగా మారావని ఒక్క అడుగు ముందుకు వేసావని అనుకుంటాను.

రవి ,నిజంగా ఆ ప్రయత్నమే చేశాను గీతా కాని పడిపోయాను, నేను స్వల స్రవంతిలో పూర్తిగా మునిగిపోయాను.

గీత . ఏమిటి బావా నువ్వనేది?

ర : ఇది నకను నీతో ఎప్పుడూ అనని మాట అనలేని మాట.

గీత . అంటే

ర . మత్తయిన కోరికలలో మెత్తని కౌగిలిలో పడ్డాను.

గీత : బావా

ర : ఎన్నోసార్లు పడ్డాను గీతా. గుండెకు దెబ్బగాని మనసుకు నొప్పిగాని తగలేదు. కాని ఇప్పుడు హృదయానికే బలమైన దెబ్బతగిలింది గీతా.

గీత . బావా.

ర : ముక్కలై రెండు వక్కలై మిగిలింది గీతా.

గీత . ముందు చూపు లేకుండా ఎందుకలా చేశావు బావా.

ర : ముందుచూపే అలా చేశాను. ముందుగా కలిపించే అందాలను చూసి తొందర పడటంలో తప్పేమీ లేదుగా.

గీత : వద్దు బావా ఈ ప్రేమలూ ఆరాధనలూ బూటకాలు ప్రేమించటం తర్వాత తపించటంలేదు. సాధించేదేమీలేదు అందుకే ఎవ్వరిని ప్రేమించకు ఈ ఆరాధనలో మనసుకు కావలసిన తపిన విశ్రాంతి

ళగా వెనక్కి తిరిగింది. ఇంతలో కరుణాకరం. చూస్తూ ఐదుగు మంది వచ్చాడు కూర్చోడానికి ప్రయత్నం చేశాడు మత్తులో]

కరు , ఇక్కడ కుర్చీలుండా చేశారు. తాగుబోతు వెధవలు: [అంటూ కుర్చీలో చేరగిలపడి, జేబులోనుండి ఓదాటిల్ తీసి, ఎత్తి ఎత్తాడు. గిత ఆపుచేసింది]

కరు : ఎవర్నువు:

గిత . నేనండీ-గీతను.

కరు , గీత.... జీవితంలో గీతవా? తలమీద రాతవా?

గిత . ఏమిటండీ మీ మాటలు? ఏమిటి మీరుచేస్తున్నదని?

కరు . తాగుతున్నాను.

గిత . ఎందుకు తాగుతున్నారు?

కరు . ఎందుకు తాగకూడదో తెలుసు కుందామని.

గిత . పిల్లలండి.... మీరు తాగడానికి వీలులేదు.

కరు . తాగకుండా వుండటానికి...అంతకన్నా వీల్లేదు.

గిత . మళ్ళీ తాగుడుకు అలవాటుపడి. పాత జీవితంలోకి వెళ్ళడానికి వీల్లేదు.

కరు . క్రొత్త జీవితంలో నేనేం పండుకున్నాను?

గిత : ఏవండీ

కరు . చెప్పుగీతా? ఇంట్లో దీపం వెలిగింది కాని...ఆ వెలుగును నేనెప్పుడు చూశాను? గుండెల్లో అనురాగం పొంగింది కాని నేనెప్పుడు తృప్తిపడ్డాను?

గిత : మరి నన్నెందుకు చేసుకున్నారు?

కరు : నీ అంతరాత్మ నన్ను గతంలోకి నెట్టివేస్తుంది. అబ్బడుగుల వతి పోలానే సానుభూతితో భర్తనయ్యాను. మనశ్శాంతి కలిగించ డానికి-

గిత : ఏమండీ?

కరు ఇప్పుడిప్పుడే ఏకదువులో పూసిక పోసుకుంటున్నా, ఓ బిడ్డకు తండ్రి కావడానికి గీతా?

గీత . నేను చెప్పినా మిమ్మల్ని త్రాగనివ్వను.

రఘు . నేను త్రాగినా- నిన్ను మాత్రం చావనివ్వను గీతా. నువ్వు బ్రతకాలి- మారేడులా పచ్చగా బ్రతకాలి. ఆ బ్రతుకులో వందమందిని బ్రతికించాలి. న్యాయానికి ఏదేశమైనా అన్యాయం చేస్తాదేమోగాని, ఈ కటకాకరం, ఎప్పుడూ ఎవ్వరికీ అన్యాయం చేయదు గీతా చేయలేదు... అందుకే.... నువ్వు- బ్రతకాలి. న్యాయంకోసమైనా బ్రతికితీరాలి. [అంటూ బయటికి వెళ్ళిపోయాడు ]

గీత ; ఏమండి! ఏమండీ! (అంటూ ఏడుస్తూ వెంబడించింది మ : బయటకొచ్చి అంతా విన్నాడు.)

మ . చిన్నమ్మా!

గీత . మధూ! (దావురుమంది)

మ . ఏమైంది చిన్నమ్మా?

గీత , అంతా చీకటైపోయింది మధూ!

మ . నాన్నగారు .... మళ్ళీ త్రాగుతున్నారా?

గీత . తప్పత్రాగుతున్నారు మధూ! తప్పిపోతున్నారు.

మ. ఆయన న్యాయవాది చిన్నమ్మా అందుకే... న్యాయమైన దారి వెదకుతున్నాడు.

గీత . మిమ్మెందుకిలా చిత్రవధ చేస్తున్నారు? నేనేం పాపం చేశానని చంపుతున్నారు?

మ . నువ్వెప్పుడో చనిపోతావుగా చిన్నమ్మా.

గీత . మధూ.

మ . అవును చిన్నమ్మా నిన్ను బ్రతికించాలని నీ బ్రతుకు మోడులా చిగురించాలని నేనూ నాన్నగారు... కోరుకోవటంలో తప్పేం లేదుగా-

గీత . లేదు మధూ మీ తప్పేలేదు. తప్పంతా నాది. ఇంకా నేను జీవించి వుండటమే తప్పు ఈ విషాదాన్ని యింకా దాచుకుని ఈ అగ్నిని గుండెల్లో రగిలించుకుంటూ- బ్రతకటం నాదే తప్పు- [అంటూ తన గదిలోనికి వెళ్ళింది.]

సు. చిన్నమ్మా చిన్నమ్మా [అంటూ తడుముకుంటూ వెర్రిగా కల
తోయాడు అప్పుడే బయటనుండి వచ్చిన మదన్ పట్టుకున్నాడు]
ఎవరున్నావు?

మద. నాపేరు మదన్.

సు. మదన్ నువ్వేనన్నమాట.

మద. లోగడే నాపేరు తెలుసా నీకు?

సు. తెలుసు. జీతాల్లో నిప్పులు పోస్తావని ఆ నిప్పుల్లో కాలిపోతు
బ్రతుకుల్ని చంపి నవ్వుతావని తెలుసు.

మద. నీకు తెలిసింది చాలతక్కువ.

సు. అవును చాలతక్కువే నీకు మానవత్వం లోపించిందని ఇప్పుడు
తెలిసింది.

మద. అలక్ష్యంగా అర్థం చేసుకున్నావు.

సు. ఛీ నువ్వు మనిషివికాదు.

మద. పశువును కూడా కాదు.

సు: ఎందుకిలా అకృత్యాలు చేస్తున్నావు,

మద. మంచిచేస్తే చూసేవాళ్ళులేరు గనుక.

సు. వెలుగును చూడ్డం ఇష్టంలేదా నీకు?

మద. బ్రతుకంతా చీకటిగానే మిగిలిపోయింది అందుకేచెడి పోయాను
ఆశలూ అన్నిచంపుకున్నాను, మమతా మానవతలూ అన్నిచంపు
కున్నాను.

సు. నేను గీత తెలుసుకదూ?

మద. నాకు చాలామంది ఆడవాళ్ళు తెలుసు అందరితోనూ అంతో ఇంతో
పరిచయంవుంది అందుబాటులోవున్న అందాలను అనుభవించి
దానికి నేనెప్పుడూ వెనుకాడలేదు.

సు. నీ సుఖాన్ని నేనెప్పుడూ కాదనలేనుకాని గీతవట్టి అమాయకురాలు
ఆమె జీవితంలో యెందుకు కలుషితాన్ని చల్లావు? ఆమె నెందు
కిలా నరకంలో త్రోసివేశావు?

మద. దానికి కారణం మీనాన్న.

మ . ఏమిటి నువ్వనేది?

మద . అవును... నేనిలా చెడిపోవడానికి బజారుబిడ్డగా జీవించడానికి మీ నాన్నే కారణం.

మ , నో నేన్నమ్మను ఆయన చాల మంచివాడు — ఒకరికి అన్యాయం చేయడమంటే కూనాన్నకిష్టంలేదు,

మద . చెబితే తీరనంత అన్యాయం నాకు చేశాడు.

మ . ఏం చేశాడు?

మద . మధూ. నేనూ మనిషిలా బ్రతకాలని మానవత్వం పుద్ధరించాలని ఎన్నోసార్లు ప్రయత్నించాను, కాని మీనాన్న నన్ను బదులుగా ఉండనీలేదు.... అందుకే, అందుకే,

మ , విషయంచెప్పు (ఇంతలో గీత బయటకొచ్చింది )

గీత . మధూ. మళ్ళి ఎందుకొచ్చావు? ఇంకేం సాధించాలని యిక్కడి దాకా వచ్చావ్? మధూ. వీడే — వీడే మధూ వెలుగుతున్న నా బ్రతుకును ఆర్పింది వీడే మధూ.

మ . గీతా!

గీత . మధూ! ముందీ దుర్మార్గుణ్ని బయటికి వెళ్ళమను— బ్రతుకుల్ని అగాధంలో నెట్టి ఆనందంగా నవ్వుతూ తిరిగే యీ కసాయివాణ్ని వెళ్ళిపొమ్మని చెప్పు. వాడిమొహం చూస్తేనే మహాపాపం మధూ! మహా పాపం.

మద . అవును గీతా! నేను పాపిని కసాయివాడిని దుర్మార్గుడిని అంత వరకే తెలుసుమీకు కాని— నేనుమారడానికి నరకం అనుభవించడానికి— కారణం ఎవరు? మీరు మీరు మీరు?

మ , మదన్.

మద . అవును— మీరే మీరే మీరే మీరే.

గీత . వద్దు.... ఇకనువ్వేం చెప్పొద్దు. కల్లి బొల్లి మాటలతో మాకళ్ళు కప్పడానికి యింకా ప్రయత్నించవద్దు. దయచేసి వెళ్ళిపో [అంటూ లోనికి పరుగుదీసింది.]

మ . మదన్. మళ్ళీ చెడిపోవడానికి కారణం మానాన్నా?

మద . అవును గీతను పాడుచేయడానికి నీకళ్ళు పోవడానికి కారణం ఎవరు? మీనాన్న:

మ . మదన్!

మద . అవును మధూ నువ్వు నమ్మలేవు పెద్దరికం పేరుతో న్యాయం అనే ముసుగు వేసుకుని నన్నెంత అన్యాయం చేశాడో నీకేం తెలుసు?

మ . మానాన్న యింత అపకారం చేశాడా?

మద . అంతా యింతా కాదు. ఆ పెలిక పూడ్చుకోవడానికి, తన బ్రతుకంతా అర్పణ చేసినా తీరనిలోటు చేశాడు.

మ . ఏం చేశాడు.

మద . నాకూ ఓతల్లి వుంది ఆతల్లి వట్టి అమాయకురాలు కల్లా కపటం ఎరుగని ఉత్తమ యిల్లాలు, మీనాన్నను నమ్మింది. లేదు— నమ్మించాడు. పెళ్ళాడుతానని ప్రమాణం చేశాడు ఆమె జీవితంలో ప్రవేశించాడు శీలం హరించి పెదాలు తుడుచుకున్నాడు. అతల్లి తల్లి తన సర్వస్వం మీనాన్నకే అర్పణచేసి పెళ్ళాడమని కాళ్ళ మీద పడింది. ఒక్కసారి తన మెడలో కట్టి యిల్లాలును చేయమని ప్రార్థించిందికాని— మీనాన్న ఏంచేశాడో తెలుసా మధూ?

మ . ఏం చేశాడు. మానాన్న ఏం చేశాడు? [ఇంతలో కరుణాకరం ఇంటినుండి వచ్చాడు.]

కరు . నేను చెబుతాను మధూ మిగిలిన కథ నేను చెబుతాను, ఆరు నెలల గర్భవతిని నిరాకరించాను. సంఘం సాంప్రదాయం అడ్డొస్తాయని కులాలూ మతాలూ వెక్కిరిస్తాయని ఆమెను తిరస్కరించాను, ఆశ్రయం లేకుండా చేశాను.

మ . నాన్నా!

కరు . అవును మధూ. చేతులారా ఆమె జీవితాన్ని చీకటి [illegible] అంతటి ఇరుకుల్లో వెలుగును కరువుచేసిన కసాయివాడిని నేనే బాబూ, నేనే.

మధు. ఈ పెద్ద మనిషి మోజు తీర్చుకున్న తర్వాత ఆమె పుట్టింటికి
చేరింది. కాని అక్కడా పుట్టగతులేకుండా చేశాడు గిరి తండ్రి.
"నువ్వు చెడిపోయావే. నీకీ యింట్లో స్థానంలేదు. నీ ముఖం
నాకు చూపించకు" అని తరిమేశాడు అప్పుడు అమ్మ నన్ను
చెట్టు నీడన కన్నది. ఆ చెట్టు కొమ్మలకు వుయ్యాలవేసి నన్ను
పడుకోబెట్టి జోలపాడింది. తన కడుపు కట్టుకుని ప్రతియింట్లో
ఊడిగంచేసి నన్ను బ్రతికించింది. ఇలా పదేళ్ళు గడిచాయి. ఒక
రోజు ఆమె జ్వరంతో పడిపోయింది దిక్కుతోచని తన అక్కున
చేర్చుకుని తనివితీరా ఏడ్చి ఏడ్చి ఏడుస్తున్న నా కళ్ళలో నీరు
తుడిచి నీకూ ఒక తండ్రి వున్నాడు బాబూ ఆయన నిన్ను గొప్ప
వాడిని చేస్తారు వెళ్ళు బాబూ అని అడ్రసు యిచ్చి కన్ను మూసింది.
ఐదేళ్ళ పసివాడిని నడిరోడ్డున పడేసి బజారు బిడ్డగా తయారు
చేసింది: కాని . మీనాన్న అప్పటికీ ఇప్పటికీ నేనే నీతండ్రిని
అని ఒక్కమాట చెప్పలేదు. అందుకే కసితీర్చుకున్నాను మీ అం
తమీద పగతీర్చుకున్నాను. చెప్పుమధూ. నేను చేసిన తప్పేమిటో
చెప్పు. నాకు జరిగిన అన్యాయంలో ఏ ఒకంతైనా జరిగితే మీరేం
చేస్తారో చెప్పుమధూ

మధు. నేనేం చేస్తానో తెలుసా. తృప్తిగా నిన్ను అన్నయ్యా అని
పిలుస్తాను.

మ : మధూ

మధు. అవునన్నయ్యా మళ్ళీ మళ్ళీ పిలుస్తాను కరువైన ఆత్మీయత నీతో
నిండేంత వరకూ పిలుస్తానన్నయ్యా

మ . తమ్ముడూ

మధు. అన్నయ్యా

కర . బాలా బాబూ ఇప్పుడు నా మనసు చల్లబడింది. న్యాయం దొరుకనేను
చేసిన నేరాలు క్షమించగలిగే యిద్దరు కొడుకులు నాకున్నారు ఇక

. నాకు చింతలేదు బ్రతుకు మీద ఆశలేదు. గీతా, గీతా[గీతలోప ల్నుండి తూలుతూ వచ్చింది] ఏం జరిగింది గీతా?

గీత . ఏం లేదండీ మీ యిద్దరి కొడుకుల్ని చూసి ఆనందంతో హృదయం పొంగిఏదో మైకం వచ్చింది

కరు . గీతా ఇటు చూడు నేనేం చేయబోతున్నానో చూడు.(అంటూ ఆమె మెళ్ళో తాళి తెంచాడు)

గీత . నాకు తెలుసండి పసుపు కుంకాలతో నన్ను సాగనంపాలని ఆశపడు న్నారు వద్దండీ...నాకేమీవద్దు. మీపాదాల చెంత యింత చోటిస్తే చాలండి సంతోషంగా వెళ్ళిపోతాను [అంటూ ఆయన పాదాల మీదపడింది కరుణాకరం లేపడానికి ప్రయత్నించాడు కాని... ఆమె అప్పటికే చనిపోయింది "గీతా" అంటూ ఒక గావుకేకవేసి కరుణాకరం పడబోయాడు. మ న్ పట్టుకుని కుర్చీలో కూర్చో బెట్టాడు అంతే...ఆయన కూడా యీ లోకాన్ని విడిచాడు.]

మ . నాన్న[పెద్దగా పిలిచాడు]

మదు: అన్నయ్యా ఏం జరిగింది? నాన్నగారికి ఏం జరిగింది.

మ . నాన్న [బావురు మన్నాడు. ఇంతలో సత్యం నారే చీరెపూలు తీసుకుని వచ్చాడు విభ్రాంత పోయాడు]

స . గీతా అమ్మా గీతా

మదు. గీతను చూసి పోదామని వచ్చావా సత్యం?

స . అవును వచ్చాను జైలునుండి విడుదలై సారే, చీరతీసుకుని పసుపు కుంకాలతో సాగనంపడానికి వచ్చాను మీ పశుత్వానికి అమానుషా నికి బలై పోయిన నా చెల్లిని కళ్ళారా చూసుకుందామని వచ్చాను. అమ్మా గీతా నేనమ్మా నీ అన్నయ్యను వచ్చాన్ని! నువ్వు బ్రతికి నంత కాలం నా బ్రతుకంతా జైల్లోనే గడిపాను కాని నేను బయటి కొచ్చాను. నువ్వు తిరిగి రానిమరో లోకానికి వెళ్ళిపోయావ్ నే నెంత దౌర్భాగ్యుణ్ణి గీతా

మధు  గీతా మాట్లాడదు సత్యం మరోలోకపు హద్దులు దాటి వెళ్ళిపోయింది అక్కడ స్వార్థంలేదు. కసితో వేటాడే మానవ మృగాలులేవు. ఆకలిలేదు. నిద్రలేదు చీకటిలేని శాశ్వతమైన వెలుగులోకి వెళ్ళిపోయింది. ఆమెంతో అత్యదృష్టవంతురాలు చాల అదృష్టవంతురాలు (రమణ మహర్షి వచ్చారు. ఒకరి చేతిలో పూలదండ మరొకరి చేతిలో కప్పువుంది.)

ర . నువ్వు వచ్చావా దావా? గీతా నేనే గెలిచాను ఉత్తమ నటుడుగా గెలిచాను ఎంత పెద్ద పూలదండ వేశారో చూడు. గీతా ఈ గెలుపు నిజంగా నాది కాదు నీదే అందుకే ఈ దండ నీ మెళ్ళో వేస్తాను గీతా గీతా నువ్వు నవ్వుతున్నావా [అంటూ నవ్వుతూ ఏడ్చాడు]

మహ. గీతా నేను వ్రాసిన "శిలాకి శిక్ష" నాటకానికి ఉత్తమ రచన ఇచ్చారు గీతా ఇదిగో వెండికప్పు ఈ గెలుపు నీదే గీతా. తీసుకో [ఆమె చేతులో పెట్టాడు. బయట నుండి దానిమ్మ పండ్లతో రత్నాలు వచ్చారు.

ర . అమ్మాయిగారూ ఈ దానిమ్మ పండు తిని .. ఎర్రటి బుగ్గలు రావాలి .. తినండి

మధు  గీత చనిపోయింది రత్నాలూ ఆమె ప్రాణవాయువులు అనంత విశ్వంలో కలిసి పోయాయ్

మ , గీత చావుకు కారణం నేను (అనగానే మధు రమణ మహర్షి రత్నాలూ స్టిల్ అ పోతారు) మీరెవరూ ఆమె చావుకు కారకులు కారు నేను శిక్ష అనుభవిస్తాను ఇంతమంది మంచివాళ్ళ మధ్య ముఖం ఎత్తుకుని నేను తిరగలేను మీకు అన్యాయానికి శిక్ష అనుభవించి తీరాలి, అందుకే వెళ్తున్నాను. క్షమించమని అడిగే అర్హత కూడ పోగొట్టుకున్నవాడు శిక్ష కావాలి, శిక్ష కావాలి [అంటూ బయటకి వెళ్ళిపోయాడు, తెరజారింది]